

Chandamama, July '51 Photo by A. L Syed

బాలవీరులు

# కొందరు తల్లులకు ఇది తెలియదు!



ఏం, జాన్సన్స్ బేబీ పౌడరు లేదా? ఇంకేం, నీకు హాయిగా లేకుండుటలో ఏమి ఆశ్చర్యం! —అలాఉంటే ఎవరైనా ఏడుస్తారు. నీళ్లుపోసిన తరువాత, గుడ్డలను మార్చిన తరువాత మా అమ్మ నాకు ఈ పౌడరును రాస్తుంది—మీ అమ్మ కూడా యిలాగే చెయ్యాలి.

జాన్సన్స్ బేబీ పౌడరు ప్రపంచంలోకెల్ల అత్యంత మృదువైన చర్మములకుగాను తయారు చేయబడినదని అందరు తల్లులకు తెలుసుననుకున్నాను. పాపం! నీవు మాట్లాడలేవు — మీ అమ్మకుతెలుస్తే ఆమె ఈ పౌడరును వాడేదని నేను నమ్ముతాను.



అమ్మా

మీ పాపాయి ఏడుస్తుంటే అతనికి హాయిగా లేదన్నమాటే. అప్పుడు జాన్సన్స్ బేబీ పౌడరును రాయండి. అది యింద్రజాలం వలె పనిచేస్తుంది! జాన్సన్స్ బేబీ పౌడరులోని ప్రత్యేక దినుసులు మృదువైన చర్మములకు బాగా సరిపడి ఉపశాంతి నిచ్చును — కావుననే చాలామంది తల్లులు (మరియు తండ్రులూ!) తమకు కూడ దీనిని వాడుచున్నారు. నేడే ఒక టిన్నును కొనుడు:— పాపాయికి, మీకూ!

జ్ఞాపక ముంచుకొనుడు: జాన్సన్స్ "ప్రిక్లీహీట్ పౌడరు" చరుకు పొక్కులనుండి త్వరగా ఉపశాంతినిచ్చును.







**Johnson's BABY POWDER**

Regd. Trade Mark

జాన్సన్స్ బేబీ పౌడరు

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: ఐ.సి ఐ.(ఇండియా) లిమిటెడ్.

మూడు నియమాలు : ఏణ్ణర్థం గడువు........

1. అత్తింటిసొమ్ము, పుట్టింటిసొమ్ము మరకుండా, శీలం చెడకుండా మాణిక్య భవనం కట్టించాలి

2. పతికి తెలియకుండా పాతివ్రత్యం చెడకుండా సంతానవతి కావాలి.....

3. భర్త ప్రేమించబోయే కన్యకు తానే సవురాల్ని తెచ్చి ఇచ్చి పెండ్లి చేయాలి

వినోదా వారి

# స్త్రీ సాహసము

అంజలి..నాగేశ్వరరావు..సూర్యప్రభ..సి.యస్.ఆర్..శివరావు..రేలంగి
గిరిజ..రామ్మూర్తి..సీతారాం..సి. వరలక్ష్మి..సదాశివరావు..అన్నపూర్ణ..విజయలక్ష్మి




దర్శకత్వం...వేదాంతం రాఘవయ్య
రచన, పర్యవేక్షణ... సముద్రాల....

సంగీతం....సుబ్బరామన్, ఛాయాగ్రహణం.... రంగా * కళ.... వాలి & గోడగాంకర్...

ఆంధ్ర, సీడెడ్, నైజాం : పూర్ణా రిలీజు | మైసూర్ : అమృత పిక్చర్స్

నీచుల్ని శిక్షించటానికని
నీచపు పనులు చేస్తామా!








వరలక్ష్మి
రామగోపాల్ నటించిన

ప్రకాశ్ వారి,

# శిక్ష

రచన...... రావి.
కెమేరా...... రంగా.
మ్యూజిక్...... పెండ్యాల
ఆర్టు...... శర్మ.

ప్రొడ్యూసర్ & డైరెక్టర్... ప్రకాశరావు

ఆంధ్ర & సీడెడ్: నవయుగ ఫిలిమ్సు, విజయవాడ

మైసూరు: ప్రకాష్ పిక్చర్సు, బెంగుళూరు సిటీ :: నైజాం: కర్నాటక ఫిలిమ్సు లి., బెంగుళూరు సిటి

ఇతర వివరాలకు:

ప్రకాష్ ప్రొడక్షన్సు :: శాంథోమ్ :: మద్రాసు-4

## చందమామ

## చందాదారులకు మనవి

చందమామ ప్రతినెల, గతనెలాఖరులోనే చందాదారులకు పోస్టు చేయబడును. కాపీ చేరనిఎడల మొదటి ఆరుతారీఖుల లోగా తమ పోస్టాఫీసులో విచారించి, మాకు తెలియజేయాలి. 10 వ తారీఖు తరువాత వచ్చు కంప్లైంట్లు ఆమోదింపబడవు. గడచినమాసములలో చేరలేదనే కంప్లైంట్లు గమనింపబడవు.



# చందమామ

సంచాలకుడు: చక్రపాణి

బెంజమిన్ ఫ్రాంక్లిన్ చిన్నప్పుడు చదువుకునే రోజుల్లో ఒక చిత్రమైన అనుభవం జరిగింది. ఇంటినించి బళ్ళోకి వెళ్ళే దారిలో ఒక కమ్మరి కొలిమి వున్నది. ఆ కొలిమివంక చూస్తూ బడిమాట మరిచి, అతడు అలా నిలబడిపోయాడు. కొలిమి యజమాని ఇది కనిపెట్టి పిల్లవాణ్ణి మచ్చికచేసి పొగడ నారంభించాడు. పిల్లవాడు ఉబ్బిపోయాడు. క్రమంగా యజమాని కుర్రవానికి మంచిమాటలు చెప్పి, కొలిమికి తిత్తి ఊదించసాగాడు. బడి ఎగగొట్టి రోజూ కొలిమి ఊదుతూ వుండేసరికి బెంజమిన్ చదువు చట్టుబండలైంది. కొంతకాలానికి అతడు తనతప్పు తెలుసుకుని, పొగడ్తలకు లొంగకూడదు అని నిశ్చయించుకున్నాడు. నాటినించి ఎవరన్నా తనను పొగిడేసరికల్లా 'ఎందుకోసం పొగడుతున్నాడా', అని తనలో తను తర్కించుకునేవాడు. ఈ కొలిమిసంఘటన బెంజమిన్‌కు జీవితంలో ఒక గొప్ప గుణపాఠం నేర్పింది. బెంజమిన్‌వంటివాడు గుణపాఠంగా ఎంచిన ఈ సంఘటన మనకు మాత్రం మార్గదర్శకం కాదా? ఇటువంటివెన్నో తెలుసుకున్నప్పుడే మన జీవితం జయప్రద మవుతుంది.—ఈ వుద్దేశంతోనే 'పెద్దల చిన్నతనాలు', అనే శీర్షికను ఈ నెలనుంచీ ప్రారంభించాము.

సంపుటి 9 జూలై '51 సంచిక 1






# చేతకాని పని

ఒకచోట అలుమగలిద్ద రున్నారు
చాల అన్యోన్యమై ఉంటారు వారు
ఒకరోజు ఇద్దరికి వచ్చింది జగడం
ఎవరిపని ఎక్కువని–అది ఎలా తెగడం ?

మొగుడు అన్నాడు : ' నీవేమి చేస్తావు
పగలెల్ల ఊరికే ఉంటావు నీవు ?
మూడురోజులు నీవు జరపగల పనిని
నేనొక్క పూటలో చేసేయగలను.'

భార్య అన్నది : ' ఒహో ! అట్లాగటండి !
ఐన రేపింటిపని మీరు చేయండి !
నేనెళ్లి పొలముపని చేసి వస్తాను
ఎవరిపని తేలికో రేపు చూస్తాను.'

మరునాడు భార్య పొలమెళ్లిపోయింది
మొగుడి కింట్లోపనులు చెప్పిపోయింది.
' ఆవులను పితకాలి పాలు తీయాలి
తరువాత కూరుచొని వంట చేయాలి.'

పాలు పితికేందుకై మొగుడు వెళ్లాడు
తీసి ఎరుగడు పాలు అతడు ఏనాడు
కొత్తవానిని చూచి ఆవు బెదిరింది
మూతి పగిలేటటు లాగి తన్నింది.

రచన :
"బైరాగి"

'కుయ్యోమొర్రో' అంటు అతడు అరిచాడు
పాలుపోతేమాత్ర మేమిటన్నాడు
వంట తప్పక నేను చేయగలనంటూ
పొయ్యి ముట్టించాడు తేలికనుకుంటూ.

కత్తితో కూరగాయలు తరగబోయి
కోసుకొన్నాడతడు వెంటనే చేయి
'అయ్యో బాబో!' అంటు తడిగుడ్డ చుట్టి
కూరుచున్నాడతడు ఇక విసుగుపుట్టి.

ఇంతలో ఎసరు మరగటము విన్నాడు
లేచి గుండిగలోన బియ్యమేశాడు
కొంతసేపటిలోన అన్నముడికింది
'బుడబుడా' 'తుకతుకా' శబ్దమొచ్చింది.

గబగబా లేచి మసిగుడ్డ మరిచాడు
ఉత్తచేతులతోన వార్చబోయ్యాడు
చెయ్యి కాలింది, అది దొరలిపోయింది
అన్నమూ నేలపై పొరలిపోయింది.

ఇంతలోనే భార్య వచ్చి చూసింది
మొగుడెంత చక్కగా వంట చేసింది.
'ఏమండి! ఇంటిపని తేలికా?' అంది
మారుపలుకడు అతడు మొగమంత కంది.








ఒకప్పుడు బెంగాల్ దేశంలో గొప్ప ఉత్సవం జరుగుతున్నది. తీర్థంలో పిల్లలు ఎవళ్లకు ఇష్టంవచ్చిన వస్తువులు వాళ్లు కొనుక్కుంటున్నారు. ఏడేళ్ల పిల్లవాడు ఒకడు శివుని విగ్రహం కొనుక్కొని, దానిని ఎంతో ఆప్యాయంతో తలపైన పెట్టుకుని ఇంటికి వెళుతున్నాడు. దారిలో ప్రమాదం జరిగింది: రోడ్డుమలుపులోనించి ఒక బండి జోరుగా వస్తున్నది. ఈ బండిని చూడకుండా ఎదుటినించి ఒక కుర్రవాడు గబగబ పరుగెత్తుకు వస్తూ బండికింద పడ్డాడు. వానికి చాలా దెబ్బలు తగిలి, నెత్తురు కాలవలు కట్టినై. వీథంట నడిచే జనం ఇది చూచి 'అయ్యో పాపం!' అని అనేసి వాళ్లపనిమీద వాళ్లు పోతున్నారే కాని, కుఱ్ఱవాడిని లేవదీసినవాళ్లు ఒక్కళ్లూ లేకపోయారు.

ఈశ్వరవిగ్రహం తీసుకపోతున్న బాలుడు ఈ ప్రమాదం చూస్తూనే విగ్రహాన్ని అవతల గిరాటేశాడు. బండికింద పిల్లవాణ్ణి లేవదీశాడు. వాడి ఒంటిమీది రక్తం తుడిచి, దెబ్బలకు కట్టు కట్టాడు. వాడు స్తిమితపడగానే తన విగ్రహం తీసుకుని ఇంటికి పోదామనుకున్నాడు. పోయి చూచాడు. ఆ ఈశ్వర విగ్రహం ముక్కముక్కలైపోయివుంది!

అక్కడి గుంపులో ఒక వృద్ధుడు ఆ బాలుణ్ణి చేరబిలిచి, "అబ్బాయీ! నీ బొమ్మ పగిలిపోయిందే పాపం. మరి దేవుణ్ణి ఎలా కొలుస్తావు?' అని అడిగాడు. అందుకు ఆ బాలుడు "కష్టదశలో వున్న సోదరునికి తోడుపడగలిగాను. నాకు అదే పదివేలు. 'మానవసేవే మాధవసేవకద!' అన్నాడు. ఆ వాక్యాలు విని, అందరూ ఆశ్చర్యపోయారు. 'వీడు బాలుడుకాడు, మహానుభావుడు!" అన్నారు.

చిన్నతనమందే యిటువంటి సద్గుణాలు అలవడిన ఆ యేడేళ్ల బాలుడే పెరిగి పెద్దవాడై, ప్రపంచాన్ని గజగజలాడించాడు. ఆయనే శ్రీ వివేకానందస్వామి!




రంగన్న పదేళ్లు నిండని పసివాడు. ఐనా, వాడిది ఈడుకు మించిన ఆలోచన. పాపం, తండ్రి చిన్నప్పుడే పోయాడు. తండ్రి వానికి విడిచిపెట్టినదల్లా ఒక్క ఆవు. అదంటే రంగన్నకు ప్రాణం. ఆ ఆవుపాలు అమ్ముకొని వాడూ, వాడి తల్లీ పొట్టపోసుకొనేవారు.

తనకు తిండి లేకపోయినా సహిస్తాడు కాని, ఆవుపొట్ట ఏపాటి వెలితి ఐనా రంగన్న సహించలేకపోయేవాడు. కాలమానం మారింది. వాళ్ల పొట్ట నిండటమే కష్టమైపోయింది. ఇక ఆవునేం పోషించగలరు?

ఒకరోజు సాయంత్రం రంగన్న గడ్డిమూట బుజాన వేసుకుని వస్తున్నాడు. ఇంతలో ఆ దారిన ఎవరో యిద్దరు ఒక ఆవుని లాక్కుపోతున్నారు. చూడగా, అది తమ యింటిపక్కనుండే సుందరయ్యాగారి ఆవే! రంగన్నకి దుఃఖం పొర్లివచ్చింది. వాళ్లు ఎవరో, ఆ ఆవుని అలా ఎక్కడికి లాక్కుపోతున్నారో, ఎందుకో, తెలుసుకుందామని వాళ్లవెంటనే వెళ్లాడు.

వాళ్లు బందిలిదొడ్డి చేరుకుని, తాము తోలుకువచ్చిన ఆవుని లోపల కట్టివేశారు. మేత తెచ్చి పడేసి, నీళ్లు పట్టారు.

రంగన్న వాళ్ల దగ్గరికి పోయి, "ఈ ఆవు సుందరయ్యాగారిది కదా? యిక్కడ కట్టివేశారెందుకు?" అని అడిగాడు.

"ఊళ్లోవాళ్ల చేలల్లో పడి మేస్తూంటే కట్టిపడెయ్యక ఏంచేస్తాం?" అన్నారు వాళ్లు.

"అలాగా..." అంటూ రంగన్న యింటికి వెళ్లిపోయాడు.

తరవాత వాడు ప్రతిరోజూ ప్రొద్దునే తన ఆవుని ఆ బందిలిదొడ్డి దగ్గరికి తోలుకు వచ్చి దాదాపు రోజంతా అక్కడే వుండిపోయేవాడు. సుందరయ్యగారి ఆవు యింకా దొడ్డిలోనే వుండటం, దొడ్డివాళ్లు దానికి మేతా నీళ్లూ అమరుస్తూ వుండటం,

యం. సోమప్ప, వేపేరి



చూచేసరికి రంగన్నకి రకరకాలుగా ఆలో చనలు పోయినై.

ఒకరోజున వాడు యథాప్రకారం ఆవుని మేపటానికి తీసుకువెళ్లాడు. ఒక చెట్టునీడని కూర్చుని ఆవుని మేతకు వదిలాడు.

రంగన్నకి ఎప్పుడు నిద్రపట్టిందో తెలి యదు. మెలకువ వచ్చి చూచేసరికి, ఆవు లేదు. ఒక్కపరుగున పోయి బందిలిదొడ్డి చేరుకున్నాడు. సుందరయ్యగారి ఆవు ప్రక్కనే తమ ఆవూ కట్టివెయ్యబడివుంది.

ఇది చూడగానే రంగన్నకి మొదట దుఃఖం పొర్లివచ్చింది. కాని వెంటనే వాడికి ఒక ఆలోచన కలిగింది. "తలవని



తలంపుగా ఆవు బందిలి దొడ్డిలో కట్టివెయ్య బడింది. ఇదీ ఒకవిధంగా మంచిదే. దాని పోషణగురించి యిక విచారించవలసిన పని లేదు. నా ఆవు చల్లగావున్నది. అదే నాకు పదివేలు" అనుకున్నాడు.

మరి కాసేపటికల్లా యిల్లు చేరుకున్నాడు. "ఆవు ఏదిరా?" అని అడిగింది, తల్లి.

"ఉందిలే ఒకచోట. క్షేమంగానే వుంది. దాని పోషణగురించి మనకు చింత యేమీ అక్కర్లేదు. మన సంగతి మనం చూచుకుంటే చాలు" అన్నాడు రంగన్న.

"అదేమిటిరా అలా అంటావు? మన ఆవుని మరెవళ్లు పోషిస్తారు? ఎందుకు పోషిస్తారు? ఎవరో తీసుకెళ్లి మన ఆవును పోషిస్తేమటుకు మనకేం లాభం? ఎవళ్లన్నా తీసుకుపోయి మేపితే వాళ్లే దాని పాలు పితుక్కుంటారుకదా మరి, మనమాట?" అని అడిగింది తల్లి.

"అదంతా స్తిమితంగా చెబుతానులే" అన్నాడు రంగన్న. ఆమె వూరుకున్నది.

ఆరోజే రంగన్న బందిలిదొడ్డి దగ్గిరికి వెళ్లి అక్కడి కాపలావాళ్లతో "నేనూ మీతో పాటు యిక్కడ పశువులకు కాపలా వుండేదా?" అని అడిగాడు.





అందుకు వాళ్ళు, "మాదేమున్నదోయ్. మునసబుగారిని అడుగు" అన్నారు.

వెంటనే రంగన్న మునసబుగారి దగ్గరకు వెళ్ళి, ప్రాధేయపడ్డాడు.

"అబ్బాయ్! అది చాలా కష్టమైన పని. నీవు చూడబోతే బొడ్డూడని కుంకవి. నిన్ను గురించి గవర్నమెంటువారికి రాయాలి. జీతాలూ భత్యాలూ యిచ్చేది వారేకదా" అన్నాడు మునసబు.

"అయ్యా నాకు జీతం వద్దు, వూరికే నౌకరీ చేస్తాను" అన్నాడు రంగన్న ఉత్సాహంతో. సరేనన్నాడు మునసబు.

* * *

మర్నాడు ఉదయం రంగన్న చద్దన్నం తిని బందిలిదొడ్డికి వచ్చాడు. మరి కాసేపటికి రంగన్న తల్లి లబోదిబోమని మొత్తుకుంటూ అక్కడికి వచ్చింది. ఆవిడ వెంట మునసబుకూడా వున్నాడు.

రంగన్నని చూస్తూనే మునసబు, "ఎంత మోసం చేశావురా నువ్వు! ఆవుని వూళ్ళోవాళ్ళ చేలోకి వదిలి, ఏమీ ఎరగనట్టు వూరుకోవటమే కాకుండా, నాకు టోపీవేసి బందిలిదొడ్డి కాపలాకు నవుకరుగా కుదిరావా?" అంటూ నిప్పులు కక్కాడు.

రంగన్నతల్లి, మునసబుగారి కాళ్ళావేళ్ళా పడి "ఈ ఒక్కసారికీ క్షమించండి బాబూ" అని వేడుకున్నది.

"సరే పైకం చెల్లించి ఆవుని తోలుకు పోండి" అన్నాడు మునసబు.

"బాబూ, కనికరించండి. చేతిలో చిల్లి గవ్వయినా లేదు" అని మొరబెట్టుకుంది ముసిలిది.

ఇంతలో రంగన్న ముందుకు వచ్చి, "బాబూ! డబ్బు అడక్కండి. మీ యిష్ట మొచ్చిన శిక్ష విధించండి" అన్నాడు.

"సరే, వీడిని ఆరు దెబ్బలు కొట్టండి" అని మునసబు ఉత్తరువిచ్చాడు.



రంగన్న చేయి చాచాడు. కాపలావాడు కొట్టడం ప్రారంభించాడు. నాలుగు దెబ్బలు పడినై. తట్టుకున్నాడు రంగన్న. ఐదోదెబ్బ పడటంతోటే స్పృహతప్పి పడిపోయాడు. కొంచెంసేపటికి తెలివి వచ్చింది. ఆరో దెబ్బకు మళ్లీ చెయ్యి చాచాడు రంగన్న.

మునసబు హృదయం కరిగిపోయింది. 'ఆగండి' అన్నాడు. వెంటనే రంగన్నని తనతో యింటికి తీసుకుపోయాడు.

వాడు కొంచెం స్తిమితపడ్డాక మునసబు "అబ్బాయీ, యిలా మోసం చెయ్యటం తప్పు కాదా?" అని అడిగాడు.

అందుకు రంగడు, "బాబూ! బందిలి దొడ్డి అంటే అసలు ఏమిటో నాకు తెలియదు. నేను కావాలని నా ఆవుని వాళ్ల చేనుపైకి తోలనూలేదు. దురదృష్టంవల్ల అది పట్టుబడి పోయింది. అందుకు నేనూ విచారించాను. కాని, ఆలోచించగా దానికి అక్కడ బాగా పోషణ జరుగుతున్నదికదా మాకు తిండికి కరవైతే ఐంది. పాపం అదైనా అక్కడ హాయిగా వుంటోంది అని తృప్తి కలిగింది. దాన్ని వదిలి నేను క్షణం సేపు ఉండలేను. అందుకనే జీతం బత్తెం లేకపోయినా నౌకరీ యిప్పించమని కోరాను. ఇప్పుడు మీరు ఆవుని తోలుకెళ్లమంటున్నారు. మా పొట్ట గడవటమే కష్టంగావుందే, దాని సంగతి ఏం చూడగలం?" అన్నాడు.

మునసబు రంగన్నని చేరదీసి, 'ఎంత అమాయకుడివిరా, రంగన్నా! ఊళ్లోవాళ్ల పశువుల్ని మేము వూరికే పోషిస్తామనుకున్నావా? పోనివ్వు. ఇవాల్టినుండి మీరు మా యింట్లో ఉండిపొండి. మీ ఆవునికూడా మా పశువులతోపాటే ఉండనీ. అన్నింటినీ నీవే కాస్తూవుండు" అన్నాడు.

నాటినించి రంగన్న ఎంతో విశ్వాసంగా పని చేసుకుపోతున్నాడు. వాడూ, వాడితల్లీ, వాళ్ల ఆవూ క్షేమంగా వుంటున్నారు.






## 13

[ కవలసోదరులూ, రాకుమార్తెలూ యుక్తిచేసి రాక్షసుడి తమ్ముణ్ణి చంపివేయటమూ, వాడికి పట్టుబడకుండా కోతులుగా మారిపోవటమూ, తలవనితలంపుగా గెడ్డపువాడిని తమ సేవకుడుగా చేసుకోగలగటం, చివరకు రాక్షసుడిని చంపబోయిన ఉదయనుడు బావిలో పడద్రోయబడటం—ఇవన్నీ క్రిందటిమారు చదివారుకదా! తరువాత—]

బావిలో పడిపోయిన ఉదయనుడు గెడ్డపువాడి రూపంలో అలాగే ఒకవారం రోజులపాటు వుండిపోయాడు. బైటపడే మార్గం కనుపించలేదు. ఇక అక్కడ భస్మంవల్ల అదృశ్యం చేయబడిన సంధ్యా నిశీథులు గెడ్డపువాడితో సహా అలా అదృశ్యరూపంలోనే ఉండిపోవలసివచ్చింది. ఎందుచేతనంటే వాళ్లకి తిరిగి మామూలు స్వరూపాలు తెప్పించగల భస్మంకూడా ఉదయనుడిదగ్గరే చిక్కుకొని పోయిందాయె.

వీళ్ల స్థితి యిలా ఉండగా, ఈ వారం రోజులూ రాకుమార్తెలూ వూరుకోలేదు. క్షణమైనా విడవకుండా కనుపిస్తూవుండే మన కవల సోదరులు వారంరోజులు కనుపించకుండాపోయేసరికి వాళ్లు మళ్లీ ఏదో అపదలో చిక్కుకొనివుంటారని వెంటనే అనుకున్నారు. చుట్టుప్రక్కల అంతా గాలించి చూచారు. ఇలా వెతుకుతూవుండగా వాళ్లు ఉదయనుడు పడివున్న పాడుబావిదగ్గిరకు కూడా రావటం తటస్థించింది. అయితే గెడ్డపువాడి ఆకారంలో వుండటంచేత ఆ అంగుళం మనిషి వాళ్ళ కంటబడలేదు. వీళ్లు బావి దగ్గిరికి వచ్చిన అలికిడి వినిపించి, ఉదయనుడు కేకవేశాడు, కాని ఆకారానికి తగ్గట్టు




అతని కేకకూడా చాల చిన్నదికావటం చేత ఆ కేక రాకుమార్తెకు వినిపించలేదు.

తను కేకపెట్టకూడా రాకుమార్తెలకు తన స్థితి తెలియజేయలేక పోయినందుకు ఉదయనుడు మరింత దిగులు చెందాడు. ఐతే, ఆ క్షణమందే ఉదయనుడికి ఒక సంగతి జ్ఞాపకం వచ్చింది.

రాక్షసుడు తనను బావిలో త్రోసివేశాక, ఒడ్డున పడివున్న కత్తికూడా బావిలో పడవేసి మరీపోయాడు. ఇప్పుడు ఉదయనుడు ఆ కత్తిని బావిలోంచితీసి పైకి విసిరాడు. అది అమాంతం వచ్చి బావి ఇవతల భూమిలో దిగబడిపోయింది. ఈ కత్తిమాచి అయినా రాకుమార్తెలు తను బావిలోవున్న సంగతి తెలుసుకొంటారేమోనని ఉదయనుడి ఆశ. కాని, అతడు అనుకొన్నట్టు వాళ్లు కత్తిని వెంటనే గమనించలేదు.

మరొక వారానికి రాకుమార్తెలు మళ్లీ ఆ బావిదగ్గిరికి రావటం జరిగింది. బావి ఒడ్డున భూమిలో దిగబడివున్న కత్తిని చూస్తూనే వాళ్లు ఆశ్చర్యపోయారు. "ఇదేమిటి? క్రిందటిమారు మనం యిటు వచ్చినప్పుడు లేని కత్తి యిప్పుడు ఎక్కడి నుంచి వచ్చింది. ఒకవేళ రాక్షసుడు ఉదయనుణ్ణి చంపి ఈ బావిలో పడవెయ్యలేదుకదా?" అనుకుంటూ వాళ్లు బావిలోకి తొంగి చూచారు.

చిత్రమేమిటోగాని బావిలో సగం వరకు రకరకాల పళ్లు నిండివున్నై. వాటిపైన గెడ్డపువాడి వేషంలో ఉదయనుడు నిలుచుని వున్నాడు. అతని చేతిలో మాయ తువ్వాలు వున్నది. తువ్వాలులోనించి పళ్లు యింకా గుట్టలు గుట్టలుగా వస్తూనేవున్నై. పళ్లతో బావి నిండిపోబోతున్నదాయె!

ఆశ్చర్యంతో రాకుమార్తెలు అలాగే నిలబడిపోయారు. మరికొద్దిసేపటికల్లా పై అంచువరకు పళ్లు వచ్చేసి, బావి నిండి

పోయింది. ఆ పళ్ల గుట్టపైన నించునివున్న ఉదయనుడిని రాకుమార్తెలు చెయ్యి పట్టుకు బైటికి లాగివేశారు.

తర్వాత—తను రాక్షసుడి తల తెగ నరకటమూ, వాడు తనని బావిలో విసిరి వెయ్యటమూ, ఆతరువాత తను చేసిన వ్యూహాలూ వివరంగా రాకుమార్తెలకు చెప్పాడు ఉదయనుడు. అంతా విని వాళ్లు, "ఏమైతేనేం. ఇంతకూ మాయతువ్వాలు నిన్ను రక్షించింది. దానిని ఉపయోగించి యిలా బైటపడవచ్చుననే ఉపాయం నీకు తోచినందుకే మెచ్చుకోవాలి" అన్నారు.

వెంటనే వాళ్ళు, గెడ్డపువాడూ సంధ్యానిశీథులు అదృశ్యరూపంతో వున్నచోటికి చేరుకున్నారు. ఉదయనుడు తనవద్దవున్న భస్మం ఆ చోట చల్లేసరికి వాళ్లు ముగ్గురూ తిరిగి మామూలురూపం పొందారు.

అప్పటివరకూ జరిగిన కథ తెలుసుకోవటంతోనే గెడ్డపువాడు—"అయితే, తను బావిలో త్రోసివేసింది నన్నే అనుకున్నాడా! ఇదీ ఒకందుకు మంచిదేలే. ఇక ముందు కథ ఆలోచించాలి" అన్నాడు.

"అందుకు ఉదయనుడు నిజమే! అయితే ఈమారు వాడు వచ్చినప్పుడు నా కోసం బావిలో చూస్తాడుకదా? నేను లేకపోవడం, పైగా బావి పళ్లతో నిండివుండటం చూసి, వాడు అనుమానపడడా?" అన్నాడు.



"వాడు వచ్చేసరికి ఆ బావి అక్కడ వుంటేకదా?" అన్నాడు గెడ్డపువాడు.

వెంటనే వాళ్లు బావిదగ్గిరికివెళ్లి భస్మం చల్లేసరికి బావి మాయమైపోయింది! దానికి బదులు మామూలు మైదానం కానవచ్చింది!!

అప్పుడు ఉదయనుడు గెడ్డపువానితో "సరే, నువ్వు యిప్పుడు చెయ్యవలసిన పని ఒకటి వుంది. మేము రాకుమార్తెలను వెతకటానికని బయలుదేరి యిప్పటికి ఏడు



సంవత్సరాలు అయింది. అక్కడ రాజూ, రాణీ మేము ఏమైపోయామోనని కంగారు పడుతూవుంటారు. కనుక, నీవు ఈ క్షణం శ్రావస్తి నగరానికి బయలుదేరి వెళ్లి, రాకుమార్తెలూ, మేమూ క్షేమంగానే వున్నామనీ, త్వరలోనే సుఖంగా యిల్లు చేరుకుంటామని చెప్పి రావలసింది" అన్నాడు.

గెడ్డపువాడు సరేనని చెప్పి ఆ క్షణానే శ్రావస్తినగరానికి ప్రయాణమయ్యాడు. అప్పుడు ఉదయనుడు తను మొట్టమొదట ఈ మాయా భవనం ప్రవేశించబోయే ముందు కందకంలో పడిపోవటం, తన గుఱ్ఱాన్ని అ కందకంలోనే వుంచి, తను మాత్రం ఎలాగో బైటపడటం అంతా చెబుతూ "కాలినడకని వెళ్లితే నీవు ఎప్పటికి చేరుకోగలవు? గుఱ్ఱంమీద పోయిరా. మొదట వారు నిన్ను నమ్మకపోవచ్చు. కాని గుఱ్ఱాన్ని ఆనవాలు పట్టినతరువాత నమ్మితీరతారు" అన్నాడు.

ఉదయనుడి తెల్లగుఱ్ఱంమీద గెడ్డపువాడు బయలుదేరాడు.

అలా పోతూవుండగా, ఒక మైదానంలో దానశీలమహారాజుగారి భటులు, సంధ్యానిశీథుల గుఱ్ఱాలపైన వస్తూ గెడ్డపువానికి ఎదురైనారు. తమ రాజుగారి తెల్లగుఱ్ఱాన్ని చూస్తూనే వాళ్లు గుర్తుపట్టివేశారు. దానిపైన ఎవరో క్రొత్తమనిషి వుండటం చూచి, అటకాయించారు.

"ఎవరవయ్యా నువ్వు? ఈ గుఱ్ఱం నీకెక్కడిది? ఇలా ఎక్కడికి పోతున్నావు? చెప్పి మరీ కదులు" అన్నారు.

అందుకు గెడ్డపువాడు "నేను దానశీల మహారాజుగారికి ఒక శుభవార్త అందించబోతున్నాను. అన్నట్టు, మీరు ఎక్కివచ్చిన ఈ గుఱ్ఱాన్ని నేను యిదివరకే చూచినట్టుందే! మీరు మహారాజుగారి సేవకులా?" అని అడిగాడు.

"అవునులే. నువు తెచ్చిన ఆ శుభవార్త ఏమిటో ముందు చెప్పు" అంటూ వేగిర పెట్టారు రాజభటులు.

"రాకుమార్తెలూ, వారిని వెతకవచ్చిన బుజ్జివాళ్లూ అంతా సుఖంగా వున్నారు ఈ మాట చెప్పాలి" అన్నాడు గెడ్డపువాడు.

"అలాగా!-మేమూ, నీతోవస్తాం పద" అన్నారు భటులు సంతోషంతో.

"అలాకాదు. ఒకపని చేద్దాం. ఇప్పుడు మనం కలిసి రాకుమార్తెలు వున్నచోటికి పోదాం. మీరూ అక్కడే వుండిపోయి వాళ్లని కాపాడుతూ వుండండి. నేను తిరిగి వెళ్ళి రాజుగారికి ఈ వార్త అందించి వస్తాను" అన్నాడు గెడ్డపువాడు.

సరేనని వాళ్లు కవలసోదరులున్నచోటికి చేరుకున్నారు. భటులను అక్కడ వదిలి గెడ్డపువాడు మళ్లీ బయలుదేరాడు.

కొంతదూరం వచ్చేసరికి సుడిగాలి ప్రారంభమైంది. రాక్షసుని రాకకు ఇది గుర్తుకదా అని గెడ్డపువాడు వెంటనే గ్రహించి, గుఱ్ఱాన్ని శరవేగాన పోనీయ సాగాడు. ఐనా రాక్షసుడు రివ్వున వచ్చి గుఱ్ఱంమీద పోతున్న గెడ్డపువాడిని ఆకాశ మార్గాన ఎత్తుకుపోయాడు.







పోవటానికి పెనగులాడటంలో ఏదో రహస్యం ఉండివుండాలి. కనుక యిది ఎక్కడికి పోతే మీరు అక్కడికి పోయి, ఏమి జరుగుతుందో చూచి రండి" అన్నాడు.

రాజు యిలా చెబుతూవుండగానే గుఱ్ఱం పట్టు వదిలించుకుని పోసాగింది. రాజభటులు దానిని వెంబడించారు. కాని, యింతలోనే ముందుపోతున్న గుఱ్ఱం రాజభటులవైపుకి తిరిగి వాళ్లని 'ఆగండి!' అన్నట్టు తల ఆడించింది.

ఇది చూడగా రాజుకి ఒక ఆలోచన కలిగింది. మంత్రిని పిలిచి, "వీళ్లంతా వెంటబడటం అశ్వానికి యిష్టం లేనట్టుంది. వాళ్లని వెనక్కు పంపించెయి. నీవుమాత్రం వెంటవెళ్లు" అని చెప్పి మంత్రిని పంపాడు.

భటులను తిరిగి మహలుకి పంపివేశాక గుఱ్ఱం మళ్ళీ ముందుకు సాగింది. అప్పుడు మంత్రి ఒక్కడూ దానివెంట పోసాగాడు.

* * *

అక్కడ మన కవలసోదరులూ, రాకుమారైలూ ఎలావున్నారూ అంటే:

వార్త అందించి వస్తానని చెప్పిన గెడ్డపువాడు శ్రావస్తినగరానికి బయలుదేరి పదిరోజులు ఐంది. యింతవరకు వాడు తిరిగి

గుఱ్ఱంమాత్రం అలా తిరుగుతూ తిరుగుతూ మరొక వారానికల్లా శ్రావస్తినగరం పోయి రాజమహలు చేరుకున్నది. రాజు చూస్తూనె పరుగున ఎదురువచ్చి దానిని మహలులోకి తీసుకుపోబోయాడు. కాని అది రాజువెంట మహలులో ప్రవేశించక మొండికేసి వచ్చిన దారినే పోబోయింది.

సేవకులంతా పోగయారు. వాళ్లతో రాజు "ఉదయనుడు ఏమయ్యాడో, ఈగుఱ్ఱం యిక్కడి కెలా వచ్చి చేరుకున్నదో ఏమి బోధపడటంలేదు. దీని చేష్టలు చూస్తే వాళ్లు ఏదో ఆపదలో చిక్కుకున్నట్టు తోస్తున్నది. భవనంలోకి రాకుండా యిది వచ్చినదారినే

రాకపోయేసరికి కవలసోదరులకు పరిపరి విధాల ఆలోచనలు పోయినై. చివరకు ఒకనాడు ఉదయనుడు తన సోదరులతో "పాపం వాడు ఏమి ఆపదలో చిక్కుకున్నాడో శ్రావస్తికి పోయి నేను కనుక్కువస్తా. అంతవరకూ మీరు జాగ్రత్తగా వుండండి అవసరమైతే ఈ భస్మాలు వాడుకోండి" అని వాళ్లకి కొంతతెల్లభస్మం కొంత నల్లభస్మం యిచ్చి, నిశీథుడి నల్లగుఱ్ఱంపైన తను శ్రావస్తికి బయలుదేరాడు.




ఉదయనుడు అలా ఒక రాజ్యం మధ్యనించి వెళుతూవున్నాడు. దారిలో ఒకచోట ఒక అంధుడు కర్రతో తడుములాడుకుంటూ నడిచి వస్తూ ప్రక్కనే వున్న ఒక గోతిలో పడిపొయ్యాడు. ఈ దృశ్యం కంటబడినదే ఉదయనుడు అమాంతం గుఱ్ఱం దిగి వెళ్లి ఆ అంధుణ్ణి లేవదీశాడు. తన దగ్గిరవున్న అంజనాలు ప్రయోగించాడు. తక్షణమే అంధునికి చూపు వచ్చేసింది. అతను ఉదయనుడికి కృతజ్ఞత తెల్పుకొంటూ తన యింటికిరమ్మని ప్రాధేయపడ్డాడు. సరేనన్నాడు ఉదయనుడు.

తీరా ఇల్లు చేరుకొనేసరికి, ఆ వృద్ధుడు ఆవూరి రాజుగారి సేవకుడి తండ్రే అని తెలిసింది. తన తండ్రికి యిలా చూపు వచ్చేసరికి ఆ సేవకుడు ఉప్పొంగిపోయాడు. ఇంకేముంది, ఈ సమాచారం ఊరంతా అల్లుకొని రాజుగారి చెవిని పడింది.

రాజుగారు భటులను పంపి ఉదయనుడిని తమవద్దకి తీసుకరమ్మన్నారు. ఉదయనుడు రాజు ఎదట హాజరయాడు. ఉదయనుడిని రాజు బహువిధాల సత్కరించి, "నీవంటి ప్రజ్ఞావంతుణ్ణి ఇంతవరకూ చూచి ఎరగము. నీవు మా అస్థానంలో ఉండిపోవాలి" అని కోరాడు.

అందుకు ఉదయనుడు, "మహారాజా, మీరు చూపిన ఆదరమూ, అభిమానమూ

మరవలేను. అయితే యిప్పుడు నేను ఒక ముఖ్యమైన పనిమీద వెడుతున్నాను. అది పూర్తిచేసుకు తిరుగుదలలో మళ్లీ ఏలిన వారి దర్శనం చేసుకొంటాను" అన్నాడు.

రాజు సంతోషించి ఉదయనుడిని అతి వైభవంగా సాగనంపాడు.

అటుతరువాత ఏవిధమైన అవాంతరాలూ లేకుండా మరుసటివారానికల్లా ఉదయనుడు శ్రావస్తి నగరం చేరుకున్నాడు.

అతనిని చూస్తూనే రాజు ఎదురువచ్చి కౌగిలించుకున్నాడు. రాకుమార్తెలు క్షేమంగావున్నారని చెప్పాడు ఉదయనుడు. కొంచెం స్తిమితపడి అప్పటివరకు జరిగిన వింతలన్నీ పూసగుచ్చినట్టు చెప్పి—'మీరు నిశ్చింతగా వుండండి. త్వరలోనే మేము మీ అమ్మాయిలతో సహా క్షేమంగా తిరిగి వచ్చేస్తాము" అన్నాడు.

ఈ వార్త వినగానే రాజు హృదయం ఉప్పొంగింది. రాణి ముఖం కలకల్లాడింది. రాజ్యంలో ప్రజలంతా ఆనందసాగరంలో మునిగిపోయారు.

మరునాడే ఉదయనుడు జాగుచేయక రాజుదగ్గిర సెలవు తీసుకుని, తల్లి ఆశీర్వాదం పొంది మాయాభవనానికి మళ్లీ బయలుదేరాడు.

మరొక్క వారానికల్లా ఉదయనుడు మాయాభవనం చేరుకున్నాడు. చేరుకున్నాడే కాని, ఆ క్షణమందు కంటబడ్డ విడ్డూరం ఉదయనుణ్ణి ఒడలు కంపింప జేసింది! అంతటి భయంకరమైన దృశ్యం యేమైవుంటుంది !!—

తోటలో ఒక చెట్టుకి అయిదు పురిత్రాళ్లు వ్రేలాడుతున్నై. సంధ్యా, నిశీథుడూ, గెడ్డపువాడూ, శ్రావస్తినించి వచ్చిన రాజభటులూ అంతా ఒక్కవరుసలో నిలబడి వున్నారు. వాళ్లందరకూ కాళ్లూ చేతులూ కట్టి బిగింపబడివున్నై. ఎదురుగా పులిలాగా రాక్షసుడు నిలబడివున్నాడు. —[ఇంకావుంది]






పూర్వం ఒక రాజుగారుండేవారు. ఆయన వద్ద నాగన్న అని నౌకరుండేవాడు. నాగన్న తమాషాగా కబుర్లుచెపుతూ రాజుగార్ని నవ్విస్తూండేవాడు. అందుచేత వాడంటే ఆయన కెంతో ఇష్టం.

రాజుగారికి నౌకర్లున్నప్పుడు రాణీగారికి మాత్రం ఉండరుగనకనా? ఆమెవద్ద చంద్రిక అనే పరిచారిక ఉండేది. చంద్రిక కూడా నాగన్న కుమల్లేనే తమాషాగా కబుర్లు చెప్పి, రాణీగారికి సంతోషం కలిగించేది. అందుచేత చంద్రిక అంటే ఆవిడకి ఎంతో ఇష్టంగా వుండేది.

'మా చంద్రిక తెలివైనద'ని రాణీగారూ, 'మా నాగన్న తెలివైనవాడు' అని రాజుగారూ ఒకనాడు తీర్గా కూచుని వాదించుకోవటం మొదలెట్టేరు. ఆ దంపతులకు వాదనతెగక, మంత్రికి కబురంపి 'ఏమోయ్ మంత్రీ!—మన ఆస్థానంలో నాగన్నా, చంద్రికా ఉన్నారుకదా, వీళ్ళిద్దర్లో ఎవరు ఎక్కువ తెలివైనవారో చెప్పవలిసింది' అన్నారు. మంత్రి బాగా ఆలోచించి 'వీళ్లిద్దరూకూడా తెలివైనవాళ్లే!' అనేశాడు.

చంద్రికకు పెళ్ళీడు వచ్చింది. రాణీగారు మంత్రికి కబురుచేసి, 'మన చంద్రికకు తగిన వరుణ్ణి చూడాలి. ఈభారం నీ మీద ఉన్నదనుమా' అన్నది. నాగన్నకి కూడా పెళ్ళియీడే గనక రాజుగారు మంత్రితో, 'మంత్రీ, మన నాగన్నకి తగిన పెండ్లికూతుర్ని చూసే బాధ్యత నీమీద ఉన్నదనుమా' అన్నారు. 'చంద్రికకు తగిన వరుడు నాగన్న' అని రాణీగారితోటీ, 'నాగన్నకు తగిన వధువు చంద్రిక' అని రాజుగారితోటీ చెప్పి, వైభవంగా వాళ్లకు వివాహం జరిపించాడు మంత్రి.

కొన్నాళ్లయ్యేసరికి నాగన్న పెళ్లికిదొరికిన సొమ్ము కాస్తా ఐపోయింది. మరి, రథం

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మదరాసు



నడవటమెలా? తెలివిమంతులైన తనూ భార్యా ఆలోచించి ఒక ఉపాయం పన్నారు. చంద్రిక ఉబ్బెత్తుగా లేచి, తల విరబోసుకుని ఏడుస్తో రాణీగారి అంతః పురానికి పరుగెత్తుకెళ్లి, 'ఇంకేముందితల్లీ, కొంప మునిగిపోయింది! మా ఆయన కాలంచేశాడు! హాయిగా మీ పాదాలదగ్గిర ఉండకుండా పెళ్లి అంటూ తెచ్చి పెట్టేరు. అంతా మూణ్ణాళ్ళ ముచ్చటై ఊరుకుంది. ఇంకేంగతి నాకు?' అంటూ భోరుమంది.

ఇదంతా నిజమేనని నమ్మి, 'ఏడిస్తే ఏంలాభం చంద్రికా! ఏదో సుఖపడతావని చేశాను కాని ఇలా ఔతుందని అను

కున్నానా? ఇంతకీ ఘటన! ఎవరు తప్పించ గలరు?' అంటూ ధైర్యం చెప్పి, ఒక వర హాలమూట ఇచ్చి పంపింది రాణి.

మూటతో చంద్రిక ఇంటికి చేరటంతోనే నాగన్న దాని తెలివికి మెచ్చుకుని 'ఇంక నా తెలివి చూడు' మని చెప్పి, తను తువాలు నోట్లో కుక్కుకొని వెక్కి వెక్కి ఏడుస్తూ రాజుగారిదగ్గరకు వెళ్లాడు. రాజు గారు నిర్ఘాంతపోయి, 'ఏమిట్రా, ఏమొ చ్చింది? ఎందుకలా ఏడుస్తావు?' అన్నారు. 'ఎందుకేమిటి బాబూ, ఏ చీకూ చింతా లేకుండా కాలం వెళ్లబుచ్చుతూంటే నాకు పెళ్లి అంటూ తెచ్చి ఆ పిల్లని కట్ట పెట్టేరు. దానికి జ్వరంకాసి అకస్మాత్తుగా చనిపోయింది! నా కాపరం నట్టేట కలిసి పోయింది! ఉన్న డబ్బేదో ఆ వైద్యుడు గుంజుకుపోయాడు!' అంటూ గొల్లుమని ఏడ్చాడు నాగన్న. రాజుగారు వాడి వరస చూచి నిజమేననుకుని, 'ఏడవకొరే. ధైర్యం తెచ్చుకో' అని ఓదార్చి ఒక వెయ్యి వర హాలు వాడికిచ్చి పంపేడు.

తనకు ప్రియమైన దాసి చనిపోవటం వల్ల రాణీ విచారంలో ఉంటుందనుకొని రాజుగారు ఆమెను ఓదార్చటంకోసం

అంతఃపురానికి వెళ్ళారు. రాణి కంటపడ్డం తోనే, 'పాపం చంద్రిక ఎప్పుడూ కలకల నవ్వుతో, అందర్నీ నవ్విస్తూ ఉండేది' అని సానుభూతి వాక్యాలు ప్రారంభించారు. 'ఔను. ఐతేం, ఆ అర్ధాయుష్షువాణ్ణి కట్టపెట్టి దానికి ముండమోపితనం తెచ్చిపెట్టేము. మంత్రి చెప్పేడని తొందరపడ్డామేకాని, జాతకం చూపించి ముందుగా వాడి ఆయుర్దాయం తెలుసుకోవాలిసింది!' అంది రాణి. ఆ మాటలకు రాజు ఆశ్చర్యపోయాడు. 'అదేమిటి! చంద్రిక చనిపోతే నాగన్న అల్పాయుష్కుడంటావేమిటి?' అన్నాడు.

'సరి, సరి. చంద్రిక చనిపోయిందని ఎవరు చెప్పేరు? అది చనిపోయినా తీరిపోను! మొగుడుపోయి బ్రతకటంకన్న ఆడది తనుపోవటమే మంచిది. చంద్రికకు అలాంటి హీనపుబ్రతుకు వచ్చిపడిందని ఏడిచేసరికి వెయ్యి వరహాలిచ్చి పంపేను' అంది రాణి.

'అదేమన్నమాట? పెళ్లాం చచ్చిపోయిందని వచ్చి వెక్కి వెక్కి యేడుస్తూంటే నాగన్నకి ఇప్పుడేగా నేను వెయ్యివరహాలిచ్చి పంపేను? వాడు చనిపోయాడంటావేమిటి?' అన్నారు రాజుగారు.



'నాగన్నే పోత!' అని రాణీ, 'చంద్రికే పోయింది' అని రాజూ కొంతసేపు వాదించుకుని, ఆఖరికి ఒక నౌకర్ని 'నాగన్న యింటికి వెళ్ళి, వాళ్ళిద్దరిలో ఎవరు చనిపోయారో తెలుసుకురా' అని పంపేరు.

రాజుగారి నౌకరు వస్తున్న సంగతితెలిసి నాగన్న చంద్రికకు ముసుగుపెట్టి పడుక్కోమని చెప్పి, తను పక్కనుకూర్చుని ఏడవటం మొదలెట్టేడు. చూడటానికివచ్చిన నౌఖరు ఏమీ అడక్కుండానే తిరిగి వెళ్ళి, 'చంద్రికే పోయింది' అని చెప్పేడు. ఆ మాట వినేటప్పటికి రాణీకి కోపంవచ్చి, ఆ నౌఖరుమాటమీద నమ్మకంలేక, 'నిజం

తెలుసుకు రావలసింద'ని తన దాసీని పంపింది. అలా జరుగుతుందని ముందే తెలిసిన చంద్రిక ఈమాటు నాగన్నను పడుకోబెట్టి, తాను పక్కను కూర్చుని రోదనం చెయ్యటం మొదలెట్టింది. దాసి వచ్చిచూసి వెళ్లి, రాణిగారితో 'నాగన్నే పోయాడండి' అని చెప్పింది. ఆమాటవిన్న రాజు నమ్మలేక, రాణీని వెంటబెట్టుకుని స్వయంగా నాగన్నయింటికి బయలుదేరాడు.

రాజూ రాణీ వస్తున్నారని తెలియటంతోనే యీమాటు చంద్రికా, నాగన్నా ఇద్దరు కూడా చచ్చినవాళ్ళకుమల్లే తలో మూలా ముసుగుతన్ని పడుకున్నారు. 'నాగన్న పెళ్ళాం పోయిందన్న దుఃఖంతో ఏవిషమో త్రాగి చనిపోయుంటాడు!' అన్నారు రాజుగారు. 'అదేమన్నమాట? చంద్రిక పతివ్రత గనక మొగుడు చనిపోయాక బ్రతకటం ఎందుకని ప్రాణం విడిచేసి వుంటుంది!' అన్నది రాణీ.

మళ్లీ వాదన ప్రారంభమైంది. 'వీళ్లిద్దరిలోనూ ఎవరు ముందు చనిపోయారో చెప్పినవాళ్లకి అగ్రహారం బహుమతి!' అన్నారు రాజుగారు. ఆ మాట వినటంతోనే నాగన్న టపీమని లేచి రాజుగారి పాదాలపైన పడి, 'ప్రభూ, నేనేనండి, ముందుగా పోత!' అన్నాడు.

చంద్రికమాత్రం తక్కువదా? అదిలేచి వెళ్లి రాణీగారి పాదాలపైనపడి, 'అమ్మగారూ, ముందుగా చనిపోత నేనండి' అంది. వాళ్లిద్దరూ బ్రతికే ఉండటంచూచి, 'ఇదేం పోయికాలమర్రా, బ్రతికుండే చచ్చిపోయినట్లు నటించారు!' అన్నారు అందరున్నూ.

'ఉదరనిమిత్తం బహుకృతవేషం!' అన్నాడు నాగన్న. 'కోటివిద్యలూ కూటికొరకే!' అంది చంద్రిక. అంతా నవ్వేరు. రాజు నాగన్నకొక అగ్రహారం ఇచ్చాడు. చంద్రికకూ ఒక అగ్రహారం ఇచ్చింది రాణీ.





# చెడబుట్టాడు

వేమగిరిలో గవిరమ్మ అనే ఒక పేదరాలున్నది. గవిరి కష్టజీవి. చింపిపాతలు చుట్టబెట్టుకున్న అస్థిపంజరం ఆ వూరిలో కంటబడితే, అదే గవిరి అని ఆనవాలు. నిజానికి ఆమె తాపత్రయం చూడగా ఎవళ్లకైనా ఆశ్చర్యం కలుగుతుంది.

ఎప్పుడు లేస్తుందో యేమిటో, నాలుగైదు ఇళ్లల్లో పాచిపని చేస్తుంది. ఇంకా చీకటి ఉండగానే గేదెపాలు పితుక్కువచ్చి వాడుక వాళ్లకి పోస్తుంది. పెద్దవాళ్ల ఇళ్లల్లో వంట చేసిపెడుతుంది. అక్కడ దాని తిండికి పోను పైన ఏదో పైసా పరకా ఇస్తారు. దంపుళ్లకు పోయి నూకగింజలూ అవ్వీ నొల్లుకు తెచ్చుకుంటుంది. పొద్దుండగా ఊరి పొలిమేరకు పోయి చెట్లకింద చితుకులు ఏరుకువస్తుంది. ఎక్కడ కనపడే పేడకడులూ పోగేసుకువచ్చి పిడకలు చేస్తుంది.

'ఈవిధంగా గవిరి, క్షణమైనా తీరిక లేకుండా ఇంతగా శ్రమపడటం దేనికి? పిడకలు అమ్మి, పుల్లలమ్మి, బానిసకంటె హీనంగా కాయకష్టపడి సంపాదిస్తున్న ఈ సొమ్మంతా ఎందుకోసం?' అని అడుగుతూ వుంటారు చాలామంది.

ఆమెకు వరహాలు అని ఒక్కగానొక్క నిసుగు ఉన్నాడు. వాడిని పెంచటానికే గవిరి పడే ఈ తాపత్రయమంతా. వరాలు ప్రయోజకుడు కావాలనీ, కుటుంబం పేరు నిలబెట్టాలనీ గవిరికి పట్టుకున్న కాంక్ష. ఇందుకోసమే ఆమె కడుపు కట్టుకుని, చింపిపాతలతో కాలక్షేపం చేస్తూ, అహర్నిశలు శ్రమపడుతూవుంది.

ఇటువంటి కాంక్షతో గవిరి, అష్టకష్టాలూ పడి. కొడుకును పెంచుకుంటూ వస్తూన్నది. ఐతే తల్లి మక్కువ చూపిన కొద్దీ వరాలు దుబారగా కర్చుచేయ నారం

మా. శిరోమణి - టెక్కలి



పెద్ద ఎదిగితే అదే బుద్ధి కుదురుతుంది' అని ఓరిమితో సరిపెట్టుకునేది. ఒకయేడు పైబడుతూవుంటే వరహాలుకు బుద్ధి రావటానికి బదులు తుంటరితనం పెచ్చు పెరుగసాగింది.

పదహారేళ్లకల్లా వరాలు స్కూల్ ఫైనలు మొదటివాడుగా ప్యాసయ్యాడు. ఇందుకు తల్లి ఉప్పొంగిపోయింది. వాడికోసం ఆమె ఇంకా శ్రమపడి ఆర్జించ నారంభించింది. మరి నాలుగేళ్లు చదివి వరాలు బి. యే. కూడా ప్యాసయ్యాడు. ఇంకిప్పుడు గవిరి సంతోషానికి మేరలేకపోయింది. "ఇంకే మున్నది. నా నాయన గొప్ప ఉద్యోగం చేస్తాడు, కనక వర్షం కురిపిస్తాడు. నా కష్టాలు గట్టెక్కిపోతై. ఇంక నేను శ్రమపడక్కరలేదు..." అనుకుంది.

* * *

వేమగిరికి మొఖాసాదారు బంగారయ్య. ఆయనకు యేటా లక్షలు వస్తయి. కాని ఏం లాభం? ఆ వచ్చే రాబడిని పొదుపు చేసిపెట్టే దక్షత లేదు. అందుకని తన వ్యవహారాలు చక్కబెట్టగల ఒక నమ్మక స్తుణ్ణి చూచిపెట్టుమని స్నేహితులతో చెబుతూ ఉండేవాడు.

భించాడు. తను అరగించకపోయినా పిల్ల వాడిమట్టుకు ఆమె దివ్యమైన భోజన సదుపాయం అమర్చేది. కోరిన దుస్తులు యిచ్చేది. అయితే—'నాకోసంకదా అమ్మ ఇంతగా కష్టపడి సంపాదించిపెడుతున్నది. కనుక, జాగ్రత్తగా పొదుపుగా కాలక్షేపం చేసి ఆమెకు శ్రమ తప్పించుదాం' అనే యోచనే వరాలకి లేకపోయింది. ఒక్క మాటలో చెప్పాలెనంటే వాడు ఇష్టా రాజ్యంగా తింటూ తిరుగుతూ ఉండేవాడు.

కొడుకు దూబరచేసినకొద్దీ గవిరికి సంతోషం ఎక్కువయ్యేదికాని ఆమె ఎన్నడూ పల్లెత్తు మాటాడి ఎరగదు. 'వాడే పోయిరి,

బంగారయ్యకు ప్రాణస్నేహితుడైన రాఘవులు ఎందరినో తీసుకువచ్చి చూపాడు. ఒక్కళ్లూ బంగారయ్యకు నచ్చలేదు. అప్పుడే బి. ఏ. ప్యాసయిన వరహాలునుకూడా చూపించాడు. వరహాలు చూడ చక్కనివాడు, చురుకైనవాడు, విద్యావంతుడు. వేషభాషలవల్ల ఆకర్షించ గలవాడు—ఇటువంటి వరహాలును చూచీ చూడటంతోనే బంగారయ్య ముచ్చట పడ్డాడు. ఈనాటికి తగినవాడు దొరికినట్టు తలిచి ఆయన సంతోషించాడు.




ఐతే పెద్ద మొఖాసా ఒకనికి వప్పగించడ మంటే తేలిక కాదుకదా?—అందుకని కుర్రవాని స్థితిగతులు తెలుసుకుందామనే వుద్దేశంతో స్వయంగా వాళ్లయింటికి బయ ల్దేరాడు బంగారయ్య. దిక్కులేని పక్షి గవిరి గుమ్మంలో పిడకలు చరుస్తూవుంది. వచ్చిన మనిషిని చూడగానే 'బాబూ, వరాలూ!' అని కేకవేసింది.

వరహాలు టకటకలాడుతూ ఇవతలకి వచ్చి బంగారయ్యను గదిలోకి తీసుకు వెళ్లాడు. ఆ గదిలో యేర్పాటులన్నీ దొరల బంగళాలలో మోస్తరుగావున్నాయి. కుర్రవాని తెలివితేటలకు బంగారయ్య ఆశ్చర్య పోయాడు. 'మా మొఖాసాకు నిన్ను మేనేజరుగా వేసుకొంటున్నాము. రెండు వందలు జీతం. రేపు వచ్చి నన్ను కలుసు కోవలిసింది' అని ఆయన వరహాలుతో చెప్పాడు. కుర్రవాడు సంతోషించాడు.

గదిలోనించి తిరిగివస్తూన్న బంగా రయ్యను సాగనంపటానికని వరహాలు వెనకనే వస్తున్నాడు. అస్థిపంజరంలా వుండిన్నీ కాయకష్టపడుతూవున్న గవిరికేసి వేలెట్టి చూపుతూ "ఈమె ఎవరు పాపం!" అని అడిగాడు బంగారయ్య.

ఆ స్థితిలోవున్న ఆమె తన తల్లి అని అనటానికి నోరు రాలేదు వరహాలుకు.

అప్రయత్నంగా తడుముకోకుండా 'మా పనిమనిషేలెండి' అన్నాడు. అవుననుకున్నాడు బంగారయ్య.

* * *

మరునాడు మళ్లీ బంగారయ్యవద్దకు రాఘవులు వచ్చాడు. బంగారయ్య తను చేసిన పని చెప్పేసరికి రాఘవులు ఎంతో మెచ్చుకున్నాడు. 'చేయవలసిన పని చేశారు. మన మొఖాసా చూడటానికి వరహాలే తగిన మనిషి. పాపం, వాడి తల్లి గవిరి కష్టాలు ఈనాటికి గట్టెక్కినయికదా అని నాకు సంతోషంగావున్న'దన్నాడు.

ఏదో జ్ఞాపకం వచ్చినట్టు, గభీమని లేచాడు బంగారయ్య. "ఎవరూ? అతని తల్లి గవిరా! ఆమె ఎక్కడవున్నదీ? ఒకసారి వెళ్లి చూసివస్తే బాగుండునే!" అని ఆత్రంతో అడిగాడు.

"ఎవరేమిటి. అస్తమానం పిడకలు చరుచుకుంటూ గుమ్మంలోనే వుంటుంది. ఆ అస్థిపంజరం కనపడలేదా?" అని ఎదురు ప్రశ్న వేశాడు రాఘవులు.

"ఆమె వాని తల్లేనా!!!" అని విస్తుపోతూ బంగారయ్య కుర్చీలో కూలబడ్డాడు. కొంచెం స్తిమితపడినమీదట రాఘవులు జరిగిన సంగతి అంతా తెలుసుకున్నాడు.

* * *

బంగారయ్య చెప్పినవేళకు సరిగా, వరహాలు చక్కా ముస్తాబు చేసుకువచ్చి కాపలావాని పరంగా 'విజిటింగ్ కార్డు పంపించాడు. పిలుపు' వస్తుందనుకొని ఎదురుచూస్తున్న వరహాలు చేతికి మరుక్షణంలో మళ్లి తన కార్డే తనకు తిరిగి వచ్చింది. ఆత్రంతో అది తిప్పి చూడగా అందులో ఇలావుంది: "కన్నతల్లినే కాదన్న నీవు ఎంత ద్రోహానికైనా తగుదువు. నడు, వచ్చిన దారినే వెనక్కు."

తల వంచుకొని మరలిపోయాడు వరహాలు.





రామరావణ యుద్ధం అయిందీ అన్నారు. అంటే—లోకకంటకుడైన పదితలల రావణాసురుడూ అతని పరివారమూ నాశన మయ్యారన్నమాట. అవునా ?—అవతార పురుషుడైన శ్రీరాముడూ ఆయన పరివారమూ జేజేలమధ్యని సంతోషాంత రంగులై వున్నారు! ఐతే శ్రీరాముడి పరివారమెవరూ ? కపివీరులు !!—ఈ మాట మనం మరవనే కూడదు.

'వచ్చినవని తీరినతర్వాత ఇంకా యెందుకు లంకలో? అయోధ్యకు వెళ్ళిపోదామా !' అన్నాడు శ్రీరామచంద్రమూర్తి. వెంటనే వెళ్లి విభీషణుడు పుష్పకవిమానం తీసుకవచ్చాడు. అన్నట్టు, పుష్పకమంటే తెలుసుగా ? అది ఒక చిత్రమైన విమానం. దానిమీద ఎందరు యెక్కి కూర్చున్నా, ఇంకా ఒకరికి సరిపడే చోటు ఉంటూనే వుంటుందట !

రాముడూ, సీతా, లక్ష్మణుడూ, ఇంకా ముఖ్యులూ విమానం ఎక్కారు. వారితో పాటు హనుమంతుడూ యెక్కాడు. కపిసేనకు నాయకులైన అంగద సుగ్రీవాదులు అలా రంగంమీద నించునేవున్నారు. వారి శిక్షణకింద కపివీరులంతా తోకలు నడుముకి చుట్టేసుకుని, చేతులు నులుమూ కొంటూ బారులు తీర్చి నిలబడ్డారు.

'పోయివస్తా'మన్నట్టుగా శ్రీరాముడు ఒక శాంతయుతమైన చల్లని చూపు విసిరాడు. చెప్పలేక చెప్పలేక, లాంఛన ప్రాయంగా 'దయ వుంచండి!' అన్నారు నాయకులు. ఈ సమయంలో రాముడు కపివీరులందరివేపూ కలయజూచాడు. రామప్రభువుతో ఏదో విన్నవించుకోవాలనే ఆత్రం వారి ముఖాలలో గోచరించింది. కపివీరులు గుసగుసలాడజొచ్చారు. 'హుష్ !' అని వారిని అదమాయించారు నాయకులు.

యస్. శశిరేఖ, విజయనగరం



పెల్లుబికిన ఉత్సాహంతో కపివీరులంతా ఒక్కసారిగా కిచకిచమన్నారు. 'మా యెదటనే ఇంత ఆగడమా!'—అన్నట్టు నాయకులు వారివేపు గద్దింపుతో చూచారు.

ఈపాటి తెలుసుకోలేడా ఆ సుగుణాభి రాముడు! 'అంగదా! సుగ్రీవా!! కపి వీరులను మీరు భయపెట్టకండి. వారి మనసులో కోరికలు నిర్భయంగా చెప్ప నీయండి. వారు సామాన్యులు కారు. మనకు యుద్ధంలో జయలక్ష్మిని చేకూర్చిన శోభన దేవతలు! ఇంతకూ అధికారం చెలాయించవలసిన ఘట్టం దాటేపోయింది. అనురాగం చూపవలసిన సమయమిది...' అన్నాడు శ్రీరాముడు. ఈ అభయానికి సంతోషం పట్టలేక, కపివీరులు తోకలు సద్దుకొని, మరొక్కసారి కిచకిచలాడారు.

అప్పుడు వాలయ్య అనే కపివీరుడు ఝుడుపు వదిలి ముందుకు వచ్చి 'స్వామీ! చనవిచ్చారు గనక కడుపులో వుద్దేశం మనవి చేసుకొంటున్నాము. రామసేవ కోసం పుట్టిన వీరులము మేము. వచ్చిన పని అయింది. ఇప్పుడు మమ్మల్ని ఇలా వదిలేస్తే ఎక్కడికి పోగలం చెప్పండి. మా రామప్రభువే ఇలా వదిలేస్తే మమ్మల్ని విమానం ఎక్కించేది ఎవరు? మా సరదా తీర్చేది ఎవరు?—ఈ మాటలో పొరపా టుంటే మన్నించండి!' అన్నాడు.

'అది కాదండీ. ఎంతమందినైనా భరించి తీసుకపోవటానికి మహిమగల పుష్పకవిమానం ఉండగా, మనందరినీ ఎక్కించుకోటానికి సందేహ మెందుకో? ఎవళ్లది యేంపోవాలీఅంట!' అని పశ్నిం చాడు ఇంకొక వీరుడు.

ఇలా వీళ్లు వాదించుకునేసరికి లక్ష్మణుడికి చీకాకెత్తింది. 'చూచావా అన్నయ్యా!—ఇప్పుడే వీళ్లలో వీళ్లకు పడటంలేదు. ఈ కోతిమూకని వెంట

పెట్టుకు వెళితే నలుగురూ నవ్విపోతారు కూడాను ' అన్నాడు.

తమ్ముణ్ణి మందలించాడు శ్రీరాముడు. 'వాలయ్యా ! నీవేమీ ఆత్రపడకు. మనలో ఒక్కళ్ళమూ ఇక్కడ దిగడిపోనక్కరలేదు. అందరమూ కలిసి అయోధ్యకు వెళ్లిపోదాము. దివ్యమైన పుష్పకవిమానం ఉండగా మనకేం లోటోయ్ ! ఈ సంగతి ముందే చెప్పవలసింది మీతో. మరిచా. పొరపాటు...' అంటూ తన మందమతికి చిన్నబుచ్చుకున్నాడు.

"అవునవును. ఎంత పొరపాటు జరిగింది ! మన కపివీరుల కోరికలు ఇంకా యేమున్నాయో ఇప్పుడైనా కనుక్కోండి" అని సలహాపూర్వకంగా హెచ్చరించింది, జనని జానకి.

అంతట తిండిపోతు తిమ్మయ్య జంకుతూ వచ్చి, "రామప్రభూ !—ఎవరేమి కోరుకున్నా లేదనకుండా అనుగ్రహిస్తావనే బిరుదు ఉందికదా నీకు ? కాయా కసురూ, దుంపా ధూళీ నమిలి నమిలి విసుగెత్తిపోయింది. మీవంటి రాజాధిరాజులు రుచికరమైన లాడూలూ అవీ ఆరగిస్తారని చెప్పుకొంటారే, మేం మాత్రం వాటిని కాస్త



చవిచూడకూడదా !' అని తనకుగల అపేక్షను వెల్లడించాడు.

అమాయకమైన ఈ కోరిక విని సీతారాములు నవ్వుకున్నారు. 'అసలే కోతిమూక. అందులో ఇది యుద్ధజయం కలిగిన సంతోషసమయం. పైగా దయామయుడైన రామచంద్రుడు 'కావలసిందల్లా అడగండి' అని అభయమిచ్చివున్నాడు. వళ్లూ పై తెలియకుండా వీళ్లు ఇంకా పిచ్చికోరికలు యేమేమి కోరుకుంటారో' అనితలిచి, హనుమంతుడు హుంకరించాడు వాళ్లవైపు తిరిగి. కపివీరులు తలలు వంచారు.



తిమ్మయ్య కోరిక విన్నవెంటనే శ్రీరాముడు 'అలాగే నోయి నా తండ్రీ!— లాడూలూ అవ్వీ తప్పకుండా తిందురు గాని. అయోధ్యకు చేరుకోగానే అన్నీ చేసుకోవచ్చు. జాగెందుకు, రండి!' అన్నాడు.

గిరగిరమని తోకలు వూపుకొంటూ, బిలబిలమని కపివీరులంతా విమానం ఎక్కేశారు. ఝాంమ్మని ఝూంకారం పెడుతూ పుష్పకం గగనమార్గాన ఎగిరెగిరి పోయి, కొంచెంసేపటికల్లా అయోధ్యా నగరంలో వాలింది! అయోధ్యలో దిగీ దిగటంతోనే ముందు సీతారాములు కపి



వీరులకు విందు యేర్పాటు చేశారు. హనుమంతుడు పెద్దరికం వహించాడు.

ఒక్క గంటలో వస్తుసంభారాలన్నీ సమకూడిపోయినై. మరొక్క గంటసేపటికల్లా పంచభక్ష్య పరమాన్నాలతో ఇంతమందికీ భోజనాదికాలు సిద్ధమైనాయి. హనుమంతుడు వచ్చి 'బంతులు తీర్చి అందరూ బుద్ధిగా కూర్చోండి. వడ్డన జరుగుతుంది' అని చెప్పాడు.

ఎలా ఐతేనేం, ఆంజనేయుని మాట విని, అందరూ ఎదురుగా కూర్చున్నారు. క్షణమైనా అయిందో లేదో, ఒక వుస్తికాయ వచ్చి బంతిమధ్యన కూర్చున్న ఒక కపివీరుని ఒడిలో పడింది. వీరుడు ఆ కాయకేసి తదేకదీక్షతో చూచి చూచి, లోపల యేమిటి వుంటుందోననే ఆత్రంతో రెండు వేళ్లతోనూ నొక్కాడు. పుసుక్కుమని ఒక గింజ కాయలోనించి బయటకి జారివచ్చి, పైకి ఎగిరింది.

"ఓసీ, నలుసంత లేవే, నాకంటె ఎత్తుగా ఎగురుదామనా నీ వుద్దేశం!" అంటూ వీరుడు ఆ గింజతోపాటే ఒక్క యెగురు ఎగిరాడు. 'తమ్ముడు ఎందుకు యెగురుతున్నాడో, ఏమి ప్రమాదం వచ్చిందో, మనం





వెళ్లి సాయపడకపోతే ఎలాగా ?' అని అను కుని, ప్రక్కనున్న వీరుడూ ఎగిరాడు. ఈ యిద్దరూ ఎగిరేసరికల్లా, కారణం తెలుసుకో కుండానే ఇంకొకడూ, మరివకడూ వచ్చి వాళ్లతోపాటు గెంతులేశారు. అంతలోనే పంక్తులన్నీ చెదిరిపోయి, అందరూఒక్కచోట మూగేసి, ఒక్కలా ఎగురజొచ్చారు.

ఇది చూసి హనుమంతుడు "ఏమర్రా మీ గోలకూలా! ఇంతట్లోనే మీ బుద్ధి గడ్డి తిన్నదే! మన చేష్టలు చూచే అందరూ మనల్ని కోతుల బాగోతం అంటారు. భోజనాల వేళ ఇంత గొడవ చేశారే, మీ వాలకం చూస్తే ఆ రామయ తండ్రికి మాత్రం ఎంతకని ఓరిమి నిలుస్తుంది...?" అంటూ మందలించబోయాడు.

ఇంతలో విస్తళ్లు వేయటం, ఆ వెంటనే లాడూలు బుట్టలు చేతపట్టుకుని సీతా రాములు స్వయంగా వడ్డించ రావటం జరి గింది. "హనుమా!—మన వీరులమీద విసుక్కొంటున్నావెందుకు? చూడు. పాపం, ఎంత బుద్ధిగా కూర్చుంటున్నారో! ఏదీ, ఎక్కువగా అల్లరి చేశాడన్నావే, ఆ వీరు డేడీ? అతనికి రెండు లాడూలు! అంతే శాస్తి!!" అనేసరికల్లా ఎక్కడివాళ్లు అక్కడ సర్దుకొన్నారు. వీళ్లకి బుద్ధివచ్చింది, ఫరవా లేదని హనుమంతుడు ధైర్యంచెందాడు.

జానకీరాములు వడ్డన చేస్తూవుండగా, ఉన్నట్టేవుండి ఒక కపివీరుడు శ్రీరాముడి బుజంమీదికి ఎక్కి కూర్చున్నాడు. మరొకడు బుట్టలో లాడూలు బలవంతాన లాక్కున్నాడు. ఇంకొక కపివీరుడు ఊరుకోక జానకమ్మ మెడలో హారం తీసి పరీక్ష చేయబోయాడు, ఏదో మహా తెలిసినట్టుగా.

ఇన్ని చేసినా ఆ దంపతులు ఆనందం తోనే వున్నారు. నిజానికి, కపివీరుల చేష్టలు చూచినకొద్దీ వారికి సంతోషం ఎక్కువైంది. కాని, వారు పడే యాతన చూడలేక హను

మంతుడూ, లక్ష్మణుడూ కపివీరులను కోపదృష్టితో చూడసాగారు. "హనుమా! లక్ష్మణా!! మన బిడ్డల అల్లరి మనకు ముద్దుకాదుటోయ్! అయినా వారు చేసేది అల్లరికాదు. అది నిష్కపటమైన ఆనందం!" అన్నాడు రాముడు మందహాసంతో.

విందు పూర్తి ఐంది. ఒక్కొక కపివీరుణ్ణే ఒడిలోకి తీసుకుని శ్రీరామచంద్రమూర్తి నిమిరేసరికి, వాళ్లకు యుద్ధపు బడలిక ఎక్కడిదక్కడనే యెగిరిపోయింది.

తరువాత శ్రీరాముడి పట్టాభిషేక మహోత్సవానికి అతివైభవంగా యేర్పాట్లు జరిగినై. ఆ సమయమందు శ్రీరాముడు ప్రత్యేకించి కపిసేననూ, వాళ్ల ప్రజ్ఞనూ ప్రస్తుతించాడు. పైగా నిండు దర్బారులో "ఓ మహావీరులారా! భూలోకంలో రామ కథతోపాటు రామసేవకు అంకితమైన కపి వీరుల కథనముకూడా నడుస్తూనే వుంటుంది. కపివీరుడు కంటబడితే చాలు, మానవులకు రామాయణకథ జ్ఞాపకం వస్తుంది. అటువంటి అవినాభావ సంబంధం మున్నది రెండింటికీ. మీ సంతోషమే నా సంతోషమని తెలియటంచేత, మానవులు మిమ్మల్ని గౌరవిస్తే నన్ను పూజించినట్టుగానే భావిస్తారు. ఇంతటినుండి మీరు దేశమందుండే పుణ్యక్షేత్రాలు చేరుకుని ఉనికి యేర్పరుచుకోండి. అక్కడికి వచ్చే భక్తులు మిమ్మల్ని చూడగానే రామకథ గురుతువచ్చి ధన్యులవుతారు. మీరు చేసిన సాయానికి ఇదే నేనీయగల కానుక" అంటూ ఆప్యాయంతో వారిని దీవించాడు.

శ్రీరామచంద్రమూర్తి ఇలా చెబుతూ వుంటే జయదుందుభులు మ్రోగినై. కపివీరులమీద పుష్పవర్షం కురిసింది. కపివీరులు వాలములు ఊపుకొంటూ, సీతారాములకూ హనుమంతునికీ నమస్కరించి సెలవు తీసుకుని, కిచకిచలాడుతూ పోయి, దివ్యక్షేత్రాలు చేరుకున్నారు.






**అనగనగనగా** ఒకగురువుగారు. ఆయన విలేశ్వరమనే గ్రామంలో గురుకులం స్థాపించి, విద్య చెబుతూ ఉండేవాడు. గురువుగారు గొప్ప పండితుడనీ, శాస్త్రంలో నిధిఅనీ దేశమంతటా కీర్తి మోగిపోయింది. ఆ ఖ్యాతి విని నలుమూలలనుంచీ అనేక మంది విద్యార్థులు చదువుకోటానికని ఆయనవద్దకు వచ్చేవారు.

ఇలానే ఒకసారి దూరప్రాంతంనించి ఒక పిల్లవాడు ఉపాధ్యాయులవారివద్దకు వచ్చాడు. ఆ పిల్లవాణ్ణి చూచీ చూడటంతోనే గురువుగారికి చాలా ముచ్చటవేసింది. ఏమీ అంటే—పిల్లవాని రూపూ రేఖా, వినయమూ విధేయతా, బుద్ధికుశలతా—ఈ లక్షణాలన్నీ ఆయనను ఎంతగానో ఆకర్షించినై. అందుకని శిష్యులందరూ ఒక యెత్తూ, ఈ పిల్లవాడు ఒక్కడూ ఒక యెత్తుగానూ చూచుకోసాగాడు.

అంతేకాదు. వానికి తన యింట్లోనే బస యేర్పాటుచేసి, తనకు వచ్చిన సమస్త విద్యలూ నూరిపోశాడు. పిల్లవాడుకూడా గురువుగారికి శుశ్రూషచేస్తూ, శ్రద్ధాభక్తులతో చదువుకుని, త్వరలోనే విద్యలన్నీ నేర్చుకొన్నాడు. గురువుగారికి వానిపైన అమితమైన అభిమానం కుదిరింది.

ఇంతలో, పెళ్లియీడుకి వచ్చిన గురువుగారి అమ్మాయిని ఎవరికి యివ్వటమా అని ప్రసక్తి వచ్చింది. ఎన్నో సంబంధాలు చూచారు. ఒక్కటీ నచ్చలేదు. ఏదో ఒకటి నచ్చినా, కట్నాలు కానుకలవద్ద షరతులు కుదరలేదు.

చివరకు మెరపులాగా గురువుగారికి ఒక ఆలోచన తట్టింది. 'చక్కటి కుర్రవాడు చేతిలోఉండగా అనవసరంగా శ్రమపడి దేశాలన్నీ వెతకడ మెందుకు? చాలా కాలంనించి నాదగ్గర శిష్యరికం చేస్తున్న

సి. హెచ్. మధుసూదన రావు, తాడేపల్లిగూడెం



ఈ కుఱ్ఱవాడు లక్షణయుక్త సంపన్నుడు, నమ్మకమైనవాడు, నిజానికి ఇటువంటి కుఱ్ఱవాడు దొరకడమే దుర్లభం. అదృష్ట వశాత్తు వాడు నా శిష్యుడు కావటం సంభ వించింది' అంటూ తలపోశాడు. మారు ఆలోచన లేకుండా, మంచి ముహూర్తం చూసి, ఆ పిల్లవానికే తన కుమార్తెనిచ్చి యథావిధిగా పెళ్ళి చేశాడు.

అపూర్వమయినటువంటి ఈ వివాహానికి అందరూ ఆశ్చర్యపోయారు. గురువుగారికి శిష్యునిమీద ఉండే అనురాగమూ, శిష్యు డికి గురువుగారిపట్ల ఉండే భక్తి తాత్ప ర్యాలూ చూచి లోకులు మెచ్చుకున్నారు. ఆ పిల్లవాడు తనకు మించిన శిష్యుడైనం దుకూ, పైగా తనకు అల్లుడయినందుకూ గురువుగారు మురిసిపోయారు. నూతన దంపతులు చిలకా గోరింకల్లాగ హాయిగా సంసారం సాగిస్తూవుండటం గురువుగారికి కనుపండువుగా వుంటున్నది.

ఇలా ఉండగా—కుమార్తెకు నగలు చేయించుదామనే వుద్దేశంతో కంసాలి బ్రహ్మాన్ని ఇంటికి రప్పించారు గురువు గారు. ఇంటివద్దనే తనయెదట కూర్చోబెట్టి పని చేయిస్తేగాని యేమీ జరగటానికి వీలుండదని ఆయన నమ్మకం. బ్రహ్మం పని ప్రారంభించాడు. అల్లుడూ మామ గారూ ఒకరితరువాత ఒకరు విడవకుండా బ్రహ్మం ఎదటనే కూర్చుని కాపలా కాస్తు న్నారు. పని సాగిపోతున్నది.

ఒకరోజున గురువుగారు జపంచేసుకునే నిష్ఠలో ఉన్నారు. బ్రహ్మం ఎదట కాపలా కాస్తున్న అల్లుడు ఏదో పనిమీద ఒక్క నిమిషం గదిలోకి వెళ్ళాడు. అప్పుడు బ్రహ్మం ఒక గట్టి సుత్తిదెబ్బ కొట్టాడు. ఆ సుత్తిదెబ్బ చెవిని పడీపడటంతోనే అల్లుడు గబగబలాడుతూ వచ్చి 'బ్రహ్మం! క్షణంలో కనుగప్పి మాయచేశావే!' అన్నాడు.





బ్రహ్మం తెల్లబోతూ 'తీగ సాగకొడుతున్నాను. అంతే బాబూ!' అన్నాడు.

'ఎందుకయ్యా, అలా తెల్లబోతావు! అసలు బంగారపుదెబ్బకీ, కల్తీబంగారపు దెబ్బకీ ఆపాటి తేడా తెలుసుకోలేననుకున్నావా? నాదగ్గర సాగవు నీ ఆటలు!' అని గద్దించాడు.

ఈఘర్షణ జరుగుతూ వుండగా, జపంలో వున్న గురువుగారు లేచి వచ్చారు. 'ఏమిటయ్యా బ్రహ్మం, నమ్మినందుకు ఇలాగేనా చేయటం?' అన్నారు.

అందుకు బ్రహ్మన్న తమాయించుకుని కొంచెంసేపుండి "బాబుగారూ!—నేనొక్క మాట అంటాను, కోపగించకండి! అల్లుడుగారి తెలివితేటలు సామాన్యమైనవి కావు. అటువంటివారు మీకు దొరకటం నిజానికి ఎంతో అదృష్టమే. ఐతే..." అని ఊరుకున్నాడు.

'చెప్పవోయ్ బ్రహ్మం! సందేహిస్తావేం?' అంటూ వేగిరపెట్టాడు గురువుగారు.

"అబ్బే, మరేమీ లేదండి. అబద్ధం ఎందుకు చెప్పాలి? కడుపు కక్కూర్తికొద్దీ నేను మీ బంగారం కల్తీ చేసినమాట వాస్తవమే. ఐతే-ధ్వనినిబట్టి మేలిమి బంగారమో, కల్తీ బంగారమో కనిపెట్ట గలగటం ఒక్క మావాళ్లకే తెలుసు! మరెవళ్లకూ తరంకాదు. నేను చేసినపని అల్లుడుగారు ఇట్టె కనిపెట్టివేయగలిగారే, ఇంతటి గ్రహణశక్తి ఆయనకు ఎలా కలిగిందా అని ఆలోచిస్తున్నా' నన్నాడు.

గురువుగారు అల్లుణ్ణి ఆరాతీసి కనుక్కోగా అతడు బ్రాహ్మణపిల్లవాడినని అబద్ధంచెప్పి శిష్యుడుగా ప్రవేశించినట్టూ, నమ్మకంగా శిష్యరికంచేసి విద్య నేర్చుకున్నట్టూ తేలిపోయింది. తక్షణమే ఆయన అల్లుడినీ కూతుర్నీ వెళ్లగొట్టి, ఊరివెలపల ఒక కుటీరంలో ప్రవేశపెట్టాడు.






## 1

పూర్వం ఒక ఉద్యోగి లంచాలు పట్టి బాగా ఆర్జించాడు. రాబడి హెచ్చు కాగానే వంట బ్రాహ్మణ్ణిపెట్టి "రేపటినించీ భోజనంలోకి ఆరురకాల పదార్థాలు తయారుచేస్తూ వుండు" అని చెప్పాడు. అలాగే చేస్తూ వచ్చాడు వంటబ్రాహ్మడు.

కొద్దిరోజులకల్లా లంచాల గొడవ అధికారులకు తెలిసి ఆయనను డిస్మిస్ చేశారు.

ఉద్యోగం ఊడిపోగానే మళ్లీ వంట బ్రాహ్మణ్ణి పిలిచి "కారణాంతరాలవల్ల నా ఉద్యోగం ఊడింది. కాబట్టి ఇకముందు సాపాటులోకి ఆరు ఆధరువులు వద్దు. ఏదో రెండు పదార్థాలతోనే సరిపుచ్చుకుంటాను" అని చెప్పాడు ఆయన.

"అలాగే, బాబూ!" అన్నాడు వంట బ్రాహ్మడు. నెల తిరిగింది. సామాను నిండుకున్నవన్నాడు వంటబ్రాహ్మడు.

"అప్పుడే అయిపోవటమేమిటి" అని యజమాని అతనిని వెంటబెట్టుకుని వంటింట్లోకి వెళ్లిచూచాడు. చక్కా ఆరు పదార్థాలూ కమ్మగా తయారయి ఉన్నాయి. 'ఏమయ్యా! రెండు ఆధరువులు చాలునని చెప్పలే నీతో?' అని అడిగాడు. బ్రాహ్మడు తాపీగా, 'చెప్పారు బాబూ! అందుకనే తమకు రెండు ఆధరువులే వడ్డిస్తున్నా!' అన్నాడు. "మరి యివన్నీ ఏమిటి?" అని అడిగాడు ఉద్యోగి ఆశ్చర్యంతో.

"నేను మామూలుగా ఆరు ఆధరువులూ చేస్తూనేవున్నా. అందులో మీకు మాత్రం రెండే వడ్డిస్తున్నా" అన్నాడు బ్రాహ్మడు. 'ఏమిటయ్యా అడ్డుదిడ్డం' అన్నాడు యజమాని.

"అడ్డుదిడ్డం ఏమున్నదండి బాబూ! మీ ఉద్యోగం ఊడింది కనుక అలా సెలవిచ్చారు. కాని నావుద్యోగం వూడలేదుగా!' అన్నాడు వంటబ్రాహ్మడు.

తెల్లబోయాడు యజమాని, 'నిజమే. ఈ క్షణంతో నీ ఉద్యోగమూ ఊడుతోంది' అంటూ తక్షణమే వంట బ్రాహ్మడికి స్వస్తి చెప్పి పంపివేశాడు.

## 2

ఒకప్పుడు ఒక సన్యాసి రైలు ప్రయాణం చేస్తూవుండగా బెజవాడ స్టేషనులో టికెట్ కలెక్టరు తనిఖీకి వచ్చాడు. టికెట్టు 'లే' దన్నాడు సన్యాసి, నిశ్చలంగా కూర్చుని.

"ఇదేమిటయ్యా స్వామీ! కాషాయ వస్త్రాలుకట్టావు. గెడ్డాలు పెంచావు. మోసం చేయుటమేనా మోక్షానికి మార్గం?" అన్నాడు టికెట్టుకలెక్టరు. అందుకు సన్యాసి "మేముచేసిన మోసం యేముంది! సత్యంలోనే దేవుడున్నాడు. కనుక, సత్యంకోసమే జీవితమంతా ధారపోస్తాము. సన్యాసులకు డబ్బుండదుకదా! అందుకనే సంసారులు సన్యాసులను పోషిస్తూ తరణోపాయం తెలుసుకోవాలని శాస్త్రాలు విధిస్తున్నాయి. ఈ సూత్రాన్నిబట్టి రైలువాళ్లుకూడా మా ప్రయాణాలు సాగనిచ్చి తోడుపడాలి"అని జవాబుచెప్పాడు.

"టికెట్టు లేనివాళ్లను దింపివేయమని రైల్వేవారి సూత్రం" అన్నాడు టికెట్టు కలెక్టరు. 'వెయ్యూళ్లు తిరుగుతాం. అందరూ ధర్మాత్ములే వుంటారా నాయనా! పెట్టినమ్మ పెడుతుంది, లేనమ్మ లే"దన్నాడు సన్యాసి.

"రైల్లోనించి దింపివేయడంతో సరిపోదు. కేసుపెట్టి జైల్లోవేస్తారు కూడాను" అన్నాడు టికెట్టు కలెక్టరు. "అయితేనేమి? ప్రభుత్వంవారు జైల్లో వసతీ ఇస్తారు, భోజనమూ పెడతారు. ఇంతకంటె ఏం కావాలి?" అని ఎదురు ప్రశ్న వేశాడు సన్యాసి.

"మరైతే, జైల్లో మీ దేవుడిమాట ఏమిటి? మోక్షం సంపాదించడమెలాగ?" అంటూ పరిహసించాడు టికెట్టు కలెక్టరు. "అమాయకునిలాగా కనబడుతున్నావే. ఇక్కడవుండే దేవుడు అక్కడ లేడా? భగవంతుడు సర్వాంతర్యామి. మాకు జైలూ ఒకటే ఇల్లూ ఒకటే" అని చిరునవ్వుతో, బదులుచెప్పాడు సన్యాసి.

ఇక ప్రశ్నలు వెయ్యలేక టికెట్టు కలెక్టరు ఆ పెట్టె దిగి వెళ్లిపోయాడు.

1—వ కథ—వ్రాసింది: జి. రత్నప్రభ, సికంద్రాబాదు—బహుమతిగా ఈమెకు వాటర్ కలర్ బాక్సు పంపుతున్నాం.

2—వ కథ—వ్రాసింది: యస్. భాస్కర రావు, గుంటూరు—బహుమతిగా యితనికి అందమైన పుస్తకాల నంచి పంపుతున్నాం.




చంద్రనగరం రాజాగారికి చంపకవల్లి అనే కుమార్తె ఉండేది. చంపకవల్లికి చిన్నప్పట్నుంచీకూడా 'దాగుడుమూతలు' అంటె మహాసరదా. మంత్రికూతురు, సేనాధిపతి కూతురు, గురువుగారి కూతురు—ఇంకా ఇలా ఎంతోమంది పిల్లలను చేరదీసి, ముసిలి దాసీని ఆటలో 'తల్లి'గా చేసుకుని తోటలో పొద్దస్తమానం చంపకవల్లి దాగుడుమూతలు ఆడుతుండేది. ఆటలో దాక్కున్నప్పుడు చంపకవల్లిని తక్కినవాళ్లు సులభంగా కనిపెట్టలేక పోయేవారు. చాలాసేపు తిప్పలు పెట్టి, ఆఖరికి ఆ అమ్మాయే తను దాక్కున్న పొదలోంచి ఏ కోకిలకూతో కూసి, పట్టుబడేది. తను 'దొంగ' ఐనప్పుడుమాత్రం తక్కినవాళ్లను ఇట్టే కనిపెట్టేసేది.

శుక్లపక్ష చంద్రునిమల్లే చంపకవల్లి పెరిగి పెద్దదై, పదిహేనేళ్ల బాలాకుమార్తె అయింది. ఆమెకు పెండ్లి యీడు వచ్చిందని రాణీగారు ఒకరోజున రాజుగారితో చెప్పిందికూడాను.

అయన నమ్మలేదు. 'పసిపిల్లకుమల్లే దాగుడుమూతలు ఆడే యీడు దాటనే లేదు, అప్పుడే పెళ్లియీడు వచ్చిందంటా వేమిటి?' అన్నాడు రాజు.

'దాగుడుమూతలకేంలెండి. పెళ్లి అయి పిల్లలతల్లులయాకకూడా కొంతమంది ఆటలు ఆడుతూనే ఉంటారు' అంది రాణీ.

'సరే అలైతే. ఛప్పన్నదేశపు రాకుమారులలో ఎవరిని పెళ్లిచేసుకుంటుందో కనుక్కో' అన్నాడు రాజు.

అప్పుడు రాణీ కూతురునుపిలిచి 'ఏమే పుత్తడిబొమ్మా, ఛప్పన్నదేశపు రాజకుమారులలో ఎవరే నీ పెళ్లికొడుకు?' అని లాలించి అడిగింది.

ఎ. సర్వమంగళ, గొల్లప్రోలు.





అందుకు చంపకవల్లి, 'ఎవరేమిటి? నేను దాక్కున్నప్పుడు ఏ రాజకుమారుడైతే నన్ను కనుక్కోగలడో అతడే!' అంది.

రాణి వెళ్ళి రాజుతో చెప్పింది. రాజు ఇప్పున్నదేశపు రాజకుమారులందరికీ వినపడేటట్లు చాటింపు వేయించాడు.

రాకుమారులు రోజూ గుంపుగుంపులుగా వస్తూండడం, చంపకవల్లిని వెతుక్కోడం, ఆమెను కనుక్కోలేక వెల్లిమొహాలు వేసుకుని తిరుగుదారి పట్టటం—ఇలా జరుగుతూ వచ్చింది. ఏ రాకుమారుడూ కనుక్కోలేక పోతే కూతురికి పెళ్ళికాదేమోనని రాణీకి భయం వేసింది.

'పోనియ్యావే, పెళ్ళి కాకపోతే. హాయిగా దాగుడుమూతలు ఆడుకుంటూ మన ఉద్యానవనంలోనే ఉండిపోతాను!' అంది చంపకవల్లి. అలా అందే గాని చంపకవల్లికి పెళ్ళి చేసుకోవాలని లేకపోలేదు. పాంచాల దేశపు రాజుకొడుకు 'భానుకుమారుడు' చాలా అందంగా ఉంటాడనీ, తనకుమల్లేనే అతనికీ ఆటలంటే సరదా అనీ ఆమె విన్నది. 'చేసుకుంటే అతణ్ణే పెళ్ళి చేసుకోవాలి' అని నిశ్చయించుకుంది ఆమె. 'భానుకుమారుడింకా తనని వెతుక్కుంటో రాలేదు ఎందుచేత చెపుమా' అని అనుకుంటూ ఎదురు చూస్తూఉంది.

భానుకుమారుడికి కూడా ఆ చాటింపు వినపడింది. చంపకవల్లిని ఎలాగైనా కనుక్కొని పెళ్ళి చేసుకోవాలని మనసుపడ్డాడు. ఐతే తనకంటే కొమ్ములు తిరిగిన రాజకుమారులంతా 'చేతకానివాళ్ళ' మంటూ తిరిగివస్తూండగా తనకిమాత్రం ఈపని సాధ్యమౌతుందా అని ఊరుకున్నాడు.

భానుకుమారునికి స్నేహసాగరుడనే స్నేహితుడున్నాడు. అతను రాకుమారునితో 'ఇక్కడ కూచుని ఇలా మీనమేషాలు లెక్కపెడితే కార్యం చక్కబడుతుందా?





రా, బయల్దేరు. ఇతరులకు సాధ్యంకాని పని నీకు సాధ్యం కాదనుకోకు. నువు తప్పకుండా నెగ్గుతావు. నాకు తెలుసు' అంటూ ప్రోత్సహించి, భానుకుమారుణ్ణి చంద్ర నగరానికి లాక్కొచ్చాడు.

భానుకుమారుడు వచ్చినరోజునే మరి అరుగురు రాకుమారులు కూడా వచ్చారు. రాజుగారు ఆ యేడుగుర్నీ చూసి, 'ఇంత వరకూ ఒక్కడూ మా అమ్మాయిని పట్టలేక పోయారు. మీరూ అంతే! ఐనా వచ్చారు గనక వెతుక్కోండి' అన్నాడు. చంపకవల్లి దాక్కుని 'సైకే' అన్నాక వాళ్లని ఉద్యాన వనంలో ప్రవేశపెట్టాడు.

భానుకుమారుడూ, తక్కిన రాజకుమారులు అరుగురూ తలొకతెన్నూ వెళ్లి వెతికేరు. చెట్లు వెతికేరు, పుట్టలు వెతికేరు. పొదరిళ్లలో చూశారు. పర్ణకుటీరాలు గాలించారు. అక్కడేమిటి ఇక్కడేమిటి, అన్నిచోట్లా అన్వేషించారు. తిరిగి తిరిగి చెప్పులు అరిగి పోయినాయేగాని వాళ్లెవరూ చంపకవల్లి జాడ తెలుసుకోలేకపోయారు.

రాణీకి ఈమాటు మరీ భయంవేసింది. ఆనాడు వచ్చిన రాజకుమారులు తప్పితే ఇంక రావలసిన రాజకుమారు లెవరూ లేరాయె. చంపకవల్లి పెళ్లిమాటేమిటి?— ఇదీ అవిడకి పట్టుకున్న ఆత్రం. 'అమ్మాయ్, లేనిపోని పట్టింపులు పోక ఈ యేడుగురు రాకుమారులలోనూ నీకు నచ్చినవాణ్ణి ఎన్నుకోవే' అని బ్రతిమాలింది.

'అదేమన్నమాట. అంతగా కావలిస్తే, వీళ్లనే రేపు మళ్లీ వచ్చి వెతుక్కోమను. నన్ను కనుక్కోగలిగినవాణ్ణేగాని నేను పెళ్లి చేసుకోను!' అని నిష్కర్షగా చెప్పివేసింది చంపకవల్లి.

మరునాటి ఉదయం భానుకుమారుడు స్నేహసాగరుడితో యేటిఒడ్డుకి పోయి, 'ఒకటి కాదు నూరు అవకాశాలు ఇచ్చినా



చంపకవల్లిని కనుక్కోలే' మని నిట్టూరుస్తో చతికిలపడ్డాడు. స్నేహసాగరుడు 'ఏం చేస్తే బాగుంటుందీ?' అని ఆలోచనలో పడ్డాడు. ఇంతలో చంపకవల్లికి దాగుడుమూతల్లో కళ్లుమూసే ముసిలిది దారిని పోతూన్న దానికిమల్లేవచ్చి నిలబడి, ఏమీ ఎరగనట్లు 'ఎవరయ్యా మీరు?' అంది.

'రాకుమార్తెను వెతకటానికి వచ్చిన యేడుగురు రాకుమారులలో నేనొకణ్ణి' అన్నాడు భానుకుమారుడు.

అందుకు ముసిలిది, "ఒహెూ అలాగా? నిన్న మీరంతా వెతుకుతూన్నప్పుడు ఉద్యానవనంలో నేనూ ఉన్నాను. ఔను గాని 'ఏడుగురం' అంటావేమిటి? నేను ఎనమండుగురు రాకుమారుల్ని చూసినట్లు జ్ఞాపకమే... ఇహిహీ! హహా!! ఈ రాజకుమారులంతా ఇంతే! తొంభైయేళ్లవాన్ని, నాకు అనినంతకూడా అనలేదే నీకు! అప్పుడే ఇంత చత్వారమా?" అంటూ నవ్వేసి వెళ్లిపోయింది.

స్నేహసాగరుడు భానుకుమారుడితో 'ఏమిటోయ్, నువ్వు ఏడుగురంటే ఈ ముసిలిది ఎనమండుగురని వాదిస్తుంది?' అని అడిగాడు.

'పోనిద్దూ, పిచ్చిదాని మాటలకేమిటి? ఇంతకీ ఏడుగురైతేం, ఎనమండుగురైతేం, రాకుమార్తెను కనిపెట్టలేకపోయాక?' అన్నాడు భానుకుమారుడు.

గంట కొట్టేసరికల్లా భానుకుమారుడూ తక్కిన ఆరుగురు రాకొమారులూ ఉద్యానవనం వాకిట హాజరయారు. 'ఇంక వెతుక్కో వచ్చు. తోటలోపలకి వెళ్లండి' అని రాజు అనుమతి ఇచ్చాడు. లోపలికి వెళ్లేసమయంలో భానుకుమారుడికి ముసిలిదాని మాట జ్ఞాపకం వచ్చి ఎంతమంది ఉన్నదీ ఒక్కమాటు లెక్క చూసుకున్నాడు. 'నేను చెప్పిందేసరి. మేము యేడుగురమే ఉంట.

ముసిల్దాని మాట మతిలేని మాటే!' అనుకున్నాడు.

వాళ్లు తోటలో దశదిశలకూ వెళ్లి, పెండ్లికూతురు కనపడలేదంటూ జలక్రీడలాడే కొలనువద్దకు వచ్చి చేరుకున్నారు. భానుకుమారుడు మళ్లీ ఒకమాటు లెక్క పెట్టేసరికి ఎనమండుగురు కనపడ్డారు. 'ఇదేమి ఆశ్చర్యం? ఏడుగురల్లా ఎనమండుగురయారెట్లా? ఇందులో ఏదో కీలకమున్నది. ముసిలిది పనిగట్టుకువచ్చే ఆ మాట చెప్పిపోయింది' అనుకున్నాడు భానుకుమారుడు. తక్కిన యేడుగురూ కూచుని దిక్కులు చూడటం మొదలెట్టేరు. భానుకుమారుడుమాత్రం అలా చెయ్యలేదు. ఆ యేడుగురి మొగాలు పరిశీలించేసరికి, వారిలో ఒక మొహం క్రొత్తగా వున్నది. అతడు ముసిముసి నవ్వులతో ఆ కొత్త మొహంవద్దకు సూటిగావెళ్లి చెయ్యి పట్టుకుని, 'ఏదేశపు రాకుమారులండీ మీరు?' అని అడిగేడు.

ఆ రాజపుత్రుని వేషంలోవున్న చంపకవల్లి కోపంనటిస్తూ, 'మాది ఏదేశమైతే మీకెందుకు? రాజపుత్రికను వెతుక్కోండి. వెళ్లండి!' అని చెయ్యి విదిలిపించుకోబోయింది.

'నాకు కావాలిసే అడుగుతూవుంట. ముందు చెప్పండి. రాజపుత్రికను నెమ్మదిగా వెతుక్కుంటాం. తొందరలేదు' అని నవ్వుతూ, పిల్ల నెత్తిమీది తురాయి పాగా తీసివేశాడు.

ఇది చూచి తక్కిన రాజపుత్రులంతా రాకుమారితో 'అమ్మ దొంగా! నువ్వా మాతోపాటు మగవేషంలో వెతుకుతున్నావా? ఇదా మమ్మల్ని చిత్తుచేయటానికి నువు వేసిన యెత్తు!' అంటూ ఆమె తెలివి తేటలను మెచ్చుకున్నారు.



# చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

అడ్డము :

2. వంతెన
4. ఇరవై దస్తాలు
5. తచింపబడినది
8. అపద
9. పేనా
12. బురద
13. భూమి




నిలువు :

1. అర్జునుడు
3. లక్ష్మి
5. ఒక దుస్తు
6. చంచలమైనది
7. సముద్రము
10. చందమామ
11. పార్వతి

# యుక్తి లెక్క

★

ఒకవూళ్లో ఒక బడిపంతులు ఉన్నాడు. అయన మంచి మాటకారి. ఒకరోజున ఒక పెద్దమనిషి వచ్చి, "ఏమండి పంతులుగారూ! మీ బళ్లో పిల్లలెంత మంది వున్నారు?' అని అడిగాడు. అందుకు పంతులు యిలా చెప్పాడు, "అయ్యా! లెక్కకేం చాలామంది వున్నారు. అయితే ప్రస్తుతం ఈ పూట హాజరైంది 37 మందే. మిగతావాళ్లు ఏమయ్యారంటారేమో, వినండి. మొత్తం పిల్లల్లో ఆరోవంతు కుప్పనూర్పిళ్లని వంకబెట్టి రాలేదు. ఇదిగాక 'మా యింట్లో పెళ్లని ఒకడూ, ఒడుగని ఒకడూ' యిలాగ మరో 11 మంది ఎగ్గొట్టారు. వీళ్లుగాక రోగం వచ్చిందనీ, నొప్పొచ్చిందనీ మరో 7 గురు సెలవు బెట్టారు" అన్నాడు.

"అదేమిటి పంతులుగారూ! మొత్తం పిల్లలెంతమందీ అని అడిగితే ఈ రామాయణమంతా ఏమిటి?" అని అడిగాడు ఆ పెద్దమనిషి.

అందుకు పంతులు "ఆలోచించండి. మీకే తెలుస్తుంది" అన్నాడు. కాని ఎంత ఆలోచించినా మొత్తం పిల్లలెందరో ఆ పెద్దమనిషికి అంతు చిక్కనేలేదు. మీరు చెప్పుకోండి చూదాం? మీకూ తెలియకపోతే 56-వ పేజీ చూడండి.








## ఖాళీడబ్బాల్లో పిప్పరమెంట్లు తెప్పించటం

ఇంద్రజాలికుడు రేకుతో చేసిన టిన్ను ఒకటి దాని మూత తీసి ప్రేక్షకులదగ్గిరికి తీసుకుపోయి చూపిస్తాడు. ప్రేక్షకులు ఎంత పరిశీలనగా చూసినా అందులో ఏమీ కనపడదు. ప్రేక్షకులు యిలా పరిశీలన చేసుకున్న తర్వాత అ టిన్నుని తన బల్లపైన వుంచుతాడు తర్వాత ఎవరిదగ్గిర్నుంచైనా ఒక జేబురుమాలు అడిగి తీసుకుని దానిమీద కప్పి, మాయాదండంతో వన్-టు-త్రీ అని దానికి తాకించి మూత తీసేసరికి అందులో పిప్పరమెంట్లు, చాక్‌లెట్లు ఉంటాయి. వాటిని ప్రేక్షకులకు చూపించి అక్కడవున్న పిల్లలకు పంచిపెడితే వాళ్లు సంతోషంగా తింటారు. యిళ్లకు తిరిగివెళ్లి ఈ సంగతి అ చుట్టుప్రక్కల స్నేహితు లందరిలో వాళ్లు ప్రచారం చేస్తారు. ప్రచారానికి ఇదిఒక ముఖ్యమైన సాధన. కొంత మంది గారడీవాళ్లు ఈ టిన్నుమీద కాసిని బియ్యపు గింజలు చల్లి టిన్నులోంచి పేలాలు తెప్పించటం కద్దు. నేనూ ఇలాగే పైన కాసిని పూలుచల్లి టిన్నులోంచి పూల దండ తీసి చూపించి, అక్కడ హాజరయినవారిలో ఒక పెద్దమనిషి మెడలో వేసేవాణ్ణి. ఇలాంటియుక్తి టీపార్టీ లాంటి సమావేశాల్లో ప్రదర్శించినట్టయితే ఎంతో గమ్మత్తుగా ఉంటుంది.

ఇప్పుడు ఈ ట్రిక్కును గురించిన రహస్యం చెబుతాను. ఇదంతా మనం తయారు చేయించుకునే టిన్ను మీద ఆధారపడి ఉంటుంది. 1-వ బొమ్మలో చూపినట్లు రెండువైపులా తెరిచివుండేగొట్టం ఒకటి, 2-వ బొమ్మలో చూపినట్లు రెండువైపులా మూతలు అమర్చబడి రెండు అరలు కలిగివున్న టిన్ను ఒకటి తయారుచేసుకో.





ఈ టిన్ను 1-వ బొమ్మలో చూపబడిన గొట్టంలో దూర్చినట్టయితే ఎక్కువ బిగుతుగా గానీ, ఎక్కువ వదులుగాగానీ వుండక ఎటు జరిపితే అటు సులువుగా జరిగేట్టు వుండాలి. 2-వ బొమ్మలో ప్రకారం తయారు చేసుకొన్న టిన్నులో రెండు అరలు అమర్చు. ఒకటి పెద్ద అర మరొకటి చిన్న అర. చిన్న అరలో పిప్పరమెంట్లూ, చాక్‌లెట్లూ పోసి ఏ మాత్రమూ కాళీ లేకుండా పూర్తిగా నింపి, మూత పెట్టు. (టిన్నుని గట్టిగా కదిలించి చూపినా లోపలి పిప్పరమెంట్లు గలగలలాడకూడదన్నమాట) ఇప్పుడు ఈ రెండో టిన్నుని మొదట తయారు చేసుకున్న గొట్టంలో దూర్చు. ఇటువంటి టిన్ను తయారు చేసుకుని సభకి రావాలి. ఇది ఎలా వుండాలో 3-వ బొమ్మలో చూడు.

టిన్నుని ప్రేక్షకులకి చూపేటప్పుడు, కాళీగావున్న పెద్ద అర వాళ్లవైపు ఉండేట్టుగా పట్టుకోవాలి. వాళ్లు బాగా పరిశీలించుకుని టిన్ను ఖాళీదేనని నమ్ముతారు. ఇంకా నమ్మించాలంటె టిన్నుని కొద్దిగా వంచి ఆడించి చూపించవచ్చు. నీవు తిరిగి టేబులుదగ్గిరికి వచ్చేటప్పుడు ఒక చిన్న గమ్మత్తు చెయ్యాలి. ప్రేక్షకులకు చూపిన పెద్ద అరవున్నవైపు గొట్టంలోకి నెట్టు. ఇప్పుడు టిన్నుని తెచ్చి బల్లమీద పెట్టినట్టయితే పిప్పరమెంట్లు వున్న అర పైకి వస్తుందన్నమాట. ఇది ఎలా వుండాలో 4-వ బొమ్మలో చూడు.

తర్వాత ప్రేక్షకుల దగ్గిర జేబురుమాల తీసుకుని టిన్నుపైన కప్పివెయ్యి. మాయదండం దానిపైన ముమ్మారు తాకించి, చేతిరుమాలు తీసివెయ్యి. టిన్ను మూత తీసి పిప్పరమెంట్లూ చాక్‌లెట్లూ పంచిపెట్టు.















పాఠకులు ఈ గారడిని గురించి యి... వివరంగా తెలుసుకోదలిచితే, వారు '... మామ' పేరు ఉదాహరిస్తూ ప్రొఫెసరు... నేరుగా వ్రాయవచ్చు. మీరురాసే ఉత్త... ఇంగ్లీషులోనే వుండాలి. ఇది అతి ము...

ప్రొఫెసరుగారి అడ్రను యిది:
ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజిషియ...
12/3/A, జమీర్‌లేన్, బాలీగంజ్,
కలకత్తా - 19.

# అట్టమీది బొమ్మ

నరకుడు గొప్ప రాక్షసుడు. ఒకప్పుడు వాడు వరుణుని ఛత్రమూ, అదితి కుండలాలూ, మేరువులో ఉండే మణిపర్వతమూ—వీటిని హరించివేశాడు. దీనివల్ల లోకానికి చాలా బాధ కలిగింది. ఈ సంగతి మహేంద్రుడు పోయి కృష్ణుని చెవిని వేశాడు. నరకుణ్ణి సంహరించడానికని కృష్ణుడు సంసిద్ధు డైనాడు. ఇది విని నరకుడు మురుడనేవాడిని పురికొల్పాడు.

మురుడు ప్రాగ్జ్యోతిషపురానికి అధిపతి. వాడు ఐదుతలలు గల భయంకరుడు. జలస్తంభన విద్యలో ప్రవీణుడు. నీటిలో ఉండగా ఎవ్వరూ వాడిని జయించలేరు. అందుచేత శ్రీకృష్ణభగవానుడు గరుడవాహనం ఎక్కి, ఆకాశమార్గాన వచ్చి, ఒక్క బాణం వేసేసరికి మురుడు నిద్రనించి మేలుకొని నీటనుండి పైకి లేచి, త్రిశూలం చేతపట్టుకొని భీకరాకారంతో భూనభోంతరాళాలు దద్దరిల్లేటట్టు బొబ్బలుపెడుతూ వచ్చాడు. మహాఉగ్రుడై మురుడు తన త్రిశూలం గురిపెట్టి, గరుడునిపై తిప్పి కొట్టాడు. కృష్ణుడు ఆ త్రిశూలాన్ని ఒక్కబాణంతో ముక్కముక్కలు చేసివేశాడు. వెంటనే మురుడు అలిగి, కృష్ణునిపైన గద ఎత్తి విసిరాడు. కృష్ణుడు మళ్లీ గద వానిపైన విసిరి దెబ్బకు దెబ్బ తీశాడు. చేసేదలేక మురుడు కృష్ణునిమీదికి ఎగసి రాబోయాడు. ఇది పనికాదని శ్రీకృష్ణుడు చక్రాయుధం ప్రయోగించేసరికి మురుడు ఒక పెద్ద పర్వతానికిమల్లే నీటిలో కూలబడి ప్రాణం విడిచాడు.

మురుడు కూలిపోగానే వాని ఏడుగురు కొడుకులు—తామ్రుడు, అంతరిక్షుడు, శ్రవణుడు, విభావసుడు, వసుడు, నభస్వంతుడు, అరుణుడు అనే వాళ్లు పీఠుని సేనాధిపత్యం కింద రకరకాల ఆయుధాలూ అస్త్రాలూ చేతపట్టి కృష్ణుణ్ణి ఎదుర్కొన్నారు. యోధానయోధులను తెగటార్చిన కృష్ణునికి వీళ్లొక లెక్కా! వాళ్లుతెచ్చిన సాధనాలన్నిటినీ అవలీలగా ఖండించివేసి, ఒక్క తృటిలో వాళ్లందరనూ యమపురికి పంపించివేశాడు అవతారపురుషుడైన శ్రీకృష్ణుడు. ఈవైనం తెలిసి నరకుడు కృష్ణునిపైన పగ పట్టాడు.

# చేసి చూడు

ఒక గాజుగ్లాసు నిండా నీళ్లు తీసుకో. ఆ గ్లాసులో మునిగేపాటి అద్దుడుకాగితం ముక్క ఒకటి తీసుకో. ఆ ముక్కని నీటిపైన పడవెయ్యి. వెంటనే కాగితం నీటిని పీల్చుకుని, తేల్తూ వుంటుంది. అప్పుడు ఒక గుండుసూదిని దానిపైన వెయ్యి. మరొక గుండుసూదితో అద్దుడు కాగితాన్ని ఒకమూల మెల్లగా నీటిలోకి నొక్కి వదిలెయ్యి. వెంటనే అద్దుడు కాగితం ముక్క నీటిఅడుగుకి దిగిపోతుంది కాని గుండుసూది మాత్రం అలా నీటిపైన తేలుతూనే వుంటుంది.

* * *

తెల్లటి కార్డు ఒకటి తీసుకొని, దానినించి గుండ్రటి బిళ్ల కత్తిరించు. దీనికి ఒక వైపున పూర్తిగా నల్లటి రంగు (ఇండియన్ ఇంకు) పుయ్యి. బిళ్లకు మధ్యని గుండుసూదితో బెజ్జం పొడు. ఇప్పుడు నల్లరంగు వైపు నీ కంటిదగ్గర పెట్టుకో. ఏదైనా ఒక పుస్తకంలో పేజీ తీసుకుని, ఈ బిళ్లకు ఒక్క అంగుళం దగ్గరగా తీసుకువచ్చి చూడు. అక్షరాలు నాలుగైదురెట్లు పెద్దవిగా కనపడతై.

* * *

ఒక పల్చటి కాగితం తీసుకుని దానిని ముక్కముక్కలుగా చింపి వుంచుకో. ఒక ప్లాస్టికు దువ్వెన తీసికో. దానిని పట్టుపంచె పైన వెట్ట పుట్టేటట్టు గబగబ కొంతసేపు రుద్దు. ఇప్పుడు దువ్వెనను ఆ కాగితం ముక్కలదగ్గిర పెట్టినట్టయితే, అవి ఎగిరి వచ్చి దువ్వెనకు అంటుకుంటాయి.

* * *

ఒంటిగీత బొమ్మ:—కింద కనిపించే బొమ్మని 1 దగ్గర ప్రారంభించి, కాగితం మీదినించి పెన్సిలు ఎత్తకుండా, గీసిన గీత మళ్లీ గీయకుండా, 2 వరకు గీయాలి. మీరు గీయగలరేమో ప్రయత్నించి చూడండి.

లేకపోతే 56 పేజీ చూడండి.




వచ్చేనెల చందమామలో ఇలాటిదే మరొక ఒంటిగీతబొమ్మ వుంటుంది.

# రంగు వెయ్యండి—1-వ బొమ్మ కథ

విలాసపురాన్ని మణిశంకరమహారాజు పాలిస్తుండేవాడు. ఆయనకు వినోదాలంటే మహాప్రీతి. ఇంద్రజాల విద్యలంటే మరీసరదా. దేశంలో ఎక్కడెక్కడి ఇంద్రజాలికులనూ మాంత్రికులనూ రప్పించి, వాళ్ల విద్యలు చూచి ఆనందించేవాడు. ఒకప్పుడు మళయాళదేశాన్నుంచి ఒక గొప్ప మాంత్రికుడు వచ్చాడు. ఈ మాంత్రికుడు అందరినీ తలదన్నినవాడుగా కనుపించాడు. అందుచేత తన ఆస్థానంలోనే వుండిపోవలసిందని రాజు కోరగా మాంత్రికుడు సమ్మతించి వుండిపోయాడు.

మహారాజుకు అపురూప లావణ్యవతీ, అందాలబరిణె అయిన కుమార్తె వున్నది. మాంత్రికుడు రాజసభలో రోజూ చేసే చిత్రవిచిత్ర ప్రదర్శనాలకి రాకుమార్తె హాజరవుతూవుండేది. ఆమె సౌందర్యానికి ముగ్ధుడైన మాంత్రికుడు ఎలాగైనా ఆమెని వివాహం చేసుకోవాలనుకున్నాడు. అయితే రాజు ఒప్పుకుంటాడా? అందుచేత ముందు రాకుమార్తెని ఒప్పించి తర్వాత రాజుని ఒప్పించటం తేలికైన పనిగా తలిచాడు. రాకుమార్తెకు తన కోరిక వెల్లడించాడు. ఆమె ససేమిరా అంది. మాంత్రికుడు పట్టువిడవలేదు. రాకుమార్తె సందివ్వలేదు. యిది పనిగాదని ఒకనాటి రాత్రి—రాకుమార్తె గదిలో నిద్రిస్తూవుండగా మాంత్రికుడు చిలుకరూపం దాల్చి కిటికీగుండా ప్రవేశించాడు. మంత్రశక్తివల్ల ఆమెనుకూడా ఒక రామచిలుకగా మార్చివేశాడు. ఏమీ ఎరగనివానిలా తన గదికి రాబోగా, సేవకులు యిది కనిపెట్టారు. ఎలా అంటే: మాంత్రికుడు నిద్రించిన తరువాత రాకుమార్తె గది ప్రవేశించి చూస్తే రాకుమార్తెకు బదులు రామచిలుక వుంది. వెంటనె ఈ వార్త రాజు చెవిని పడింది. ఆయన మారు ఆలోచన లేకుండా నిద్రిస్తున్న మాంత్రికుని తల తెగనరికాడు. తీరా మాంత్రికుని యిలా చంపివేశాక రాజుకి దిగులు పట్టుకుంది. రామచిలుకగా మారిపోయిన తన కుమార్తెకు తిరిగి మామూలు స్వరూపం రావటం ఎలాగ? ఆ విరుగుడు మాంత్రికునికే తెలిసి వుండాలె! వాడు చచ్చిపోయాడే! ఏమిటి గత్యంతరం?

మాంత్రికుని గ్రంథజాలమంతా వాడి గదిలోనే వున్నది. చిలుకను మనిషిగా మార్చే రహస్యం ఆ గ్రంథాల్లో ఎక్కడ వున్నదో అక్షరక్షరమూ వెదకమని ఆస్థాన విద్వాంసుని నియమించాడు రాజు. విద్వాంసుడు వెంటనే పరిశీలన ప్రారంభించాడు. ఇదే జూన్ నెల బొమ్మ.




రంగువెయ్యండి (కథ) : 2-వ బొమ్మ

# అమ్మాయి - అత్తవారు

పీలా మల్లేశ్వరి (అనకాపల్లి)

★

కలువరేకులవంటి కళ్లుగల తల్లి
శ్రీకారమునుబోలు చెవులేమి చెవులు
సంపెంగపుష్పమే నాసికాపుటము
పాలరంగును బోలు ఫాలభాగమ్ము
పాలతరగల్లాగ అతివ చెక్కిళ్లు
ముత్యాలశ్రేణులే ఆ పళ్లవరుస
తుమ్మెదలబోలునే వనిత ముంగురులు
రాచతేజస్సును రంజిల్లునట్లు
చందమామనుమాడ్చి వెల్గొందుమోము
వికసించుచున్నది వినువీథిలోన.
అమ్మాయి పేరేమి ? అత్తవారెవరు ?
నిండుకుండలవారు కడుదొడ్డవారు
మాటదప్పనివారు మహమంచివారు
సూర్య వంశములోని సుఖశూరమణులు
అద్దాలమేడలు అమరి ఉన్నాయి
అందాలకోడెలు అలరియున్నాయి
పశుసస్యసేద్యాలు పచ్చగున్నాయి
మరది లక్ష్మణువంటి మరదలున్నారు
ధర్మరాజులవంటి బావలున్నారు
ప్రేమతో చూస్తాడు మామ దశరథుడు
పల్లెత్తుమాటనదు అత్త కౌసల్య
మన్మథాకారుడె పతి 'చందమామ'
అనుకువతొ వెల్గొందు అడమ మా 'తార'

49-వ పేజీలోని

పజిలుకు జవాబు:

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 కి | | | | 2 వా | 3 ర | ధి |
| 4 రీ | ము | | | | మ | |
| టి | | 5 ర | 6 చ | 7 న | | |
| | | 8 వి | ప | ద | | |
| | | 9 క | ల | ము | | 10 జా |
| | 11 గొ | | | | 12 ఊ | బి |
| 13 ధ | రి | త్రి | | | | ల్లి |

---

49-వ పేజీలోని

యుక్తిలెక్కకు జవాబు:

మొత్తం పిల్లలు 66.

---

53-వ పేజీలోని

'ఒంటిగీత బొమ్మ'కి జవాబు:




Controlling Editor : SRI CHAKRAPANI
Printed and Published by B. NAGI REDDI at the B. N. K. Press, Madras



Chandamama, July '51

Photo by D. I. Chintamian

వేటకుక్కలు

CHANDAMAMA (TELUGU) JULY 1951 REGD. No. M. 4854




రంగు వెయ్యండి (కథ) 1-వ బొమ్మ